

# THE PRESIDENT'S MESSAGE FOR THE INAUGURAL ISSUE OF OUR CHANDAMAMA ASSAMESE



राष्ट्रपति भवन नई दिल्ली-110004
RASHTRAPATI BHAVAN NEW DELHI - 110004
INDIA

March 26, 1976.

On the occasion of the publication of 'Chandamama' in Assamese, I offer my congratulations to the Chandamama publications on the services they have rendered to the cause of children as well as of Indian languages. I am happy to send my greetings and good wishes to the children of Assam through your magazine and wish the publication success. I hope that it will disseminate information which will help enlarge the vision and widen the knowledge of children.

# చందమామ కేమెల్

## రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

**కేమెల్—మొదటి బహుమతి రు. 15**
**కేమెల్—2వ బహుమతి రు. 10**
**కేమెల్—3వ బహుమతి రు. 5**
**కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు**
**కేమెల్—10 సర్టిఫికెట్లు**

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి. చందమామ : డాల్టన్ ఏజెన్సీస్, కొరింథియాన్, ఫ్లేట్ నం. 5, 2వ అంతస్థు, 17, అర్థర్ బందర్ రోడ్, కొలాబా, బొంబాయి-400 005. ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

పేరు\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-వయస్సు\-\-\-\-\-\-\-\-\-\-

అడ్రసు\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-\-

**ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ.** 20-5-1976

ముక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.



CONTEST NO2 Telugu

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ ["వ్యర్థమైన పరీక్ష]" బూర్లె నాగేశ్వరరావు రచన.

పరోపకారమూ, దుర్బలులకు సహకారమూ పరిపాటిగా జరిగే సమాజాలు మాత్రమే ముందుకు పోగలుగుతాయి. లేకపోయినట్టయితే బలవంతుల మధ్యా, దుర్బలుల మధ్యా సమాజం చీలిపోతుంది. కాని సమాజాన్ని ఉద్ధరించే వారి లాగా నాటకం ఆడే వాళ్లు మాత్రం, సమాజానికి వేరు పురుగులు. ఈ నీతి మనకు "అచ్చిరాని షరతులు"లో కనిపిస్తుంది.

సంపుటి 61 మే '76 సంచిక 5








# మిత్రసంప్రాప్తి

## 35

"నీకూ, నాకూ పొత్తు కుదరదు." అని హిరణ్యకం అనేసరికి లఘుపతనకం (కాకి) ఇలా అన్నది:

"నువు చిత్రగ్రీవాన్నీ, అతని అనుచరులనూ బంధవిముక్తులను చెయ్యటం చూసి నేను పరమానందం చెందాను. అందుకని నేను నీ స్నేహం కోరుతున్నాను."

"నువు తినే దానివి, నేను ఆహారాన్ని. మన ఇద్దరికీ సఖ్యం ఎలా సాధ్యం అవుతుంది? మైత్రికీ, వియ్యానికీ జన్మలూ, సంపదలూ సమంగా ఉండాలి; అంతే గాని ఒకరు ధనికులూ, ఒకరు పేదవారూ, ఒకరు బలులూ, ఒకరు దుర్బలులూ అయితే అవి సాధ్యపడవు. అందుచేత నువు తక్షణం వెళ్ళిపో," అన్నది హిరణ్యకం (ఎలుక).

"నువు బయటికి రాకపోతే నేను నీ కలుగు ద్వారం దగ్గిరే ప్రాయోపవేశం చేసి, ప్రాణాలు విడుస్తాను." అన్నది లఘుపతనకం.

"నువు ఎంత అసమంజసంగా మాట్లాడుతున్నావు! నా సహజశత్రువుతో నేను ఎలా స్నేహం చెయ్యగలను? ఎలా, కాళ్ళా వేళ్ళా పడినా, ఎంత సమభావాలు కల వాడైనా శత్రువుతో చెలిమి చేయరాదని పెద్దలు చెప్పరా? సలసల కాగే నీరు సైతం నిప్పును ఆర్పుతుంది గద!" అన్నదీ హిరణ్యకం.

"నువు చెప్పేది మాత్రం ఏం సమంజసంగా ఉన్నదీ? నా మొహం చూడకుండానే నేను నీ సహజ శత్రువునని ఎలా అంటున్నావు?" అని లఘుపతనకం అడిగింది.

---

అట్ట చివరి బొమ్మ

---

"శత్రువులు రెండు రకాలుంటాయి. కొందరు జాతి శత్రువులు. మరికొందరు ఏవో కారణాంతరాలవల్ల శత్రువులవుతారు. నువు నాకు జాతి శత్రువువు. జీవిత వ్యాపకంలో ఏదో కారణంవల్ల ఏర్పడిన శత్రుత్వాన్ని తెలివిగా పరిష్కరించవచ్చు. జాతి వైషమ్యం మాత్రం ఎవరో ఒకరు చస్తేగాని అంతం కాదు," అన్నది హిరణ్యకం.



"ఈ రెండు రకాల శత్రువుల మధ్యా తేడా తెలుసుకోవటం ఎలాగో దయఉంచి చెప్పు," అని కాకి అడిగింది.

దానికి ఎలుక ఇలా చెప్పింది:

"సంపర్కం వల్ల ఏర్పడే శత్రుత్వానికి ఏదో ఒక ప్రత్యేకమైన కారణం ఉంటుంది; ఆ కారణాన్ని తొలగిస్తే ఆ శత్రుత్వం కూడా పోతుంది. ముంగిసా, పామూ; శాకాహారమృగాలూ, మాంసాహారమృగాలూ; నీరూ, నిప్పూ; ధనికులూ, దరిద్రులూ; సింహమూ, ఏనుగూ; వేటగాడూ, లేడీ; వేదాలు తెలిసిన బ్రాహ్మడూ, నాస్తికుడూ; వివేకీ, మూఢుడూ; శీలవతులూ, నీతిమాలిన స్త్రీలూ; దేవతలూ, రాక్షసులూ-వీళ్లమధ్య సహజశత్రుత్వం ఉంటుంది. వీటిలో ఏ ఒక వర్గమూ ఇంకొక వర్గాన్ని పూర్తిగా నిర్మూలించ లేదు. కాని వాళ్ళ మధ్య సంఘర్షణ సాగుతూనే ఉన్నది; ఒకరిని తుడిచిపెట్టలేక పోయామే అన్న బాధ మరొకరికి ఉంటూనే ఉన్నది. ఇలాటి శత్రుత్వానికి విరుగుడులేదు."

"అలాటి శత్రుత్వం అనర్థమైనది. వివేకి అయినవాడు కొత్త మిత్రులను సంపాదించాలి గాని, పాత శత్రుత్వాలను పెంచుకోరాదు, కనుక నాతో స్నేహం చెయ్యి," అన్నది కాకి.

దానికి ఎలుక ఇలా అన్నది:

"నువు మంచిదానివే కావచ్చు. నాకు అపకారం చేసే ఉద్దేశం నీకు లేక పోవచ్చు. అయినా మన స్నేహం వల్ల మేలుజరగదు. చివరకు ప్రకృతిస్వభావం

జయిస్తుంది: నేను చాలా మంచిదాన్ని కాబట్టి, ఎవరి శత్రుత్వమూ నాకు కీడు కలిగించ దనవచ్చు. కాని పాణిని అనే వ్యాకరణ వేత్తను ఒక సింహం చంపింది. జైమిని అనే తత్వవేత్తను ఒక ఏనుగు చంపింది. పింగళుడు అనే వేదపండితుణ్ణి ఒక మొసలి చీల్చేసింది."

కాకి ఇలా అన్నది:

"నువు చెప్పినది నిజమే. కాని నేను చెప్పేది కూడా విను. స్నేహభావమన్నది మనుషుల మధ్య పరస్పర సహకారం ద్వారా ఏర్పడుతుంది; మంచివాళ్ళ మధ్య ప్రథమ సందర్శనంలోనే కలుగుతుంది. నీకు ఎలాటి అపకారమూ చెయ్యనని ప్రమాణం కూడా చేస్తున్నాను."

"నాకు నీ ప్రమాణాల పైన విశ్వాసం లేదు. శత్రువు చేసే ప్రమాణాలను విశ్వసించరాదు. తమను విశ్వసించని శత్రువును దేవతలు కూడా చంపలేరు. ఇంద్రుడు దితి గర్భాన్ని ఛిద్రంచేశాడు. ఎందుచేతనంటే దితి అతన్ని విశ్వసించింది. అందుచేత శత్రువును నమ్మరాదు. ఎంతటి మహా బలులు కూడా విశ్వాసం ఉంచిన కారణంగా దుర్బలుల చేత నాశం పొందుతారు," అన్నది ఎలుక.

ఈ మాటలు విని కాకి కొంత సేపు ఏమీ అనలేకపోయింది: "ఈ ఎలుకకు ఎంత నీతి తెలుసు! దీని స్నేహం చెయ్యాలనే కోరిక నాలో ఇంకా పెరుగుతున్నది గాని తరగటం లేదు," అని అది అనుకున్నది.

చివరకు అది, "ఓ, హిరణ్యకా. ఏడడుగులు కలిసి నడిస్తేనే మిత్రులవుతారంటారుగదా. ఈ దీర్ఘసంభాషణవల్ల, నువు అనుకోకుండానే, నాకు మిత్రుడవయావు. ఇలా మనం రోజూ మంచి, చెడ్డలు మాట్లాడుకోవచ్చుగద!" అన్నది.

కాకి తెలివీ, దాని మాటల్లో నిజమూ ఎలుక గ్రహించి, "అలాగే చెయ్యవచ్చు. కాని నువు నా కలుగులోకి ఎన్నడూ ప్రవేశించరాదు," అన్నది. అందుకు కాకి ఒప్పుకున్నది.






# మాయాసరోవరం

## 5

[సేనాని కొడుకు మంగళవర్మను, జయశీలుడు పులులబారి నుంచి కాపాడాడు. కనకాక్ష రాజు అతణ్ణి చాలా మెచ్చుకుని, మంత్రి సలహాపై, అతడికి ఉద్యోగం యిచ్చాడు. మంత్రి, జయశీలుడికి రాజకార్యం గురించి చెపుతున్న సమయంలో ఒక సేవకుడు విరిగిన కత్తినీ, ముత్యాలహారాన్నీ తీసుకుని అక్కడికి వచ్చాడు. తరవాత—]

కనకాక్షరాజూ, మంత్రి ధర్మమిత్రుడూ, సేవకుడు తెచ్చి యిచ్చిన విరిగిన కత్తినీ, ముత్యాల హారాన్నీ చూసి చాలా ఆశ్చర్యం చెందారు.

మంత్రి ముత్యాలహారాన్ని పరీక్షించి చూసి, "మహారాజా, యీ హారం యువరాణిదే అయి వుంటుందా? అలాగే, యీ విరిగిన కత్తి యువరాజుదై వుండదు కదా?" అన్నాడు.

రాజు హారాన్నీ, కత్తినీ అటూయిటూ తిప్పి చూసి, "ఈ వస్తువులు యువరాజూ, యువరాణీ అరణ్యంలో కనబడకుండా పోయిన చెట్టు దగ్గిర దొరికినవని చెప్పక పోతే, ఇవి వాళ్ళవే అన్న అనుమానం కూడా నాక్కలిగేదికాదు." అన్నాడు.

"నిజమే, మహారాజా! వీటిని బాగా ఎరిగినవాళ్ళకు చూపి, అవునో కాదో తెలుసుకోవలసిందే. యువరాణిగారి



ప్రధాన చెలికత్తె మల్లికను పిలిపిస్తే, యీ కత్తిమాటకేంగాని, కనీసం ముత్యాల హారాన్నయినా గుర్తించగలదు,'' అన్నాడు మంత్రి ధర్మమిత్రుడు.

రాజు చెప్పగానే సేవకుల్లో ఒకడు పోయి మల్లికను అక్కడికి తీసుకు వచ్చాడు. మల్లిక తన యజమానురాలు కనబడకుండా పోయినందుకు, యిన్నాళ్ళుగా ఎంతో దుఃఖంలో వున్నది. రాజు ఆమెకు ముత్యాలహారం ఎక్కడ దొరికిందో చెప్పకుండా, హారాన్ని ఆమె చేతికిచ్చి,'' ఈ ముత్యాలహారాన్ని అంతఃపురంలోని వాళ్ళెవరో పారేసుకున్నారు. తీసుకుపోయి వాళ్లకు యిచ్చెయ్యి,'' అన్నాడు.

మల్లిక హారంలోని ప్రతి ముత్యాన్నీ వేళ్ళతో తడివిచూస్తూ, ఒక చోట చప్పున ఆగి, చిన్నగా కేకపెట్టి, ''మహారాజా, యీ హారం యువరాణిది! మేం అరణ్యంలో విహారానికి వెళ్ళినప్పుడు, ఆమె దీన్ని ధరించి వున్నది,'' అన్నది.

ఆ హారం తన కుమార్తెదే అని మల్లిక ధృవపరచగానే, కనకాక్షరాజు మనస్సు చివుక్కుమన్నది. ఆయన మల్లికను ఏదో ప్రశ్నించబోయి కూడా, గొంతు పెగలక తలవంచుకు వూరుకున్నాడు.

రాజు స్థితి గమనించిన మంత్రి ధర్మమిత్రుడు, మల్లికను, ''అమ్మాయీ, ఇలాంటి ముత్యాల హారాలను సంపన్నులైన గృహస్థుల పిల్లలెందరో ధరిస్తూ వుంటారు. మరి యీ హారం యువరాణిదే అని నమ్మకంగా ఎలా చెప్పగలవు ?'' అని అడిగాడు.

మల్లిక, మంత్రి దాపులకు వచ్చి, ఆయనకు హారంలో వున్న రెండు ముత్యాలను చూపుతూ, ''ఈ చిట్లిన రెండు ముత్యాలనూ చూడండి! ఒకసారి యువరాణికి, నా మీద ఎందుకో కోపం వచ్చి, ఆ కోపంలో హారం తీసి నా కేసి విసిరింది. అది గురితప్పి దాపులనే వున్న చెట్టు బోదెకు తగిలింది. అప్పుడు యీ రెండు ముత్యాలూ కొద్దిగా చిట్లినవి. ఆస్థాన

స్వర్ణకారుడితో చెప్పి, హారంలో కొత్త ముత్యాలు వేయించాలనుకున్నాము,'' అన్నది.

మల్లిక జవాబుతో రాజుకూ, మంత్రికీ కూడా ఆ హారం యువరాణి కాంచన మాలదే అన్న నమ్మకం కలిగింది. ఆ తరవాత విరిగిన కత్తి యువరాజు కాంచనవర్మదే అన్నదాంట్లో ఎవరికీ అను మానం లేదు. కాని, కత్తి సగం విరిగి పోయి వుండటం మాత్రం రాజుకూ, మంత్రికీ ఆశ్చర్యకారణం అయింది.

కనకాక్షరాజు కత్తిని జయశీలుడికి యిస్తూ, ''జయశీలా! ఈ కత్తి విరగ టానికి కారణం ఏమై వుంటుందంటావు?" అన్నాడు.

జయశీలుడు కత్తిని కొంచెం సేపు పరీక్షించి చూసి, ''మహారాజా! యువ రాజు తనను పట్టవచ్చిన ఎవరో శత్రు వుతో పోరాడి వుంటాడు. కాని, కత్తి మాత్రం ఆ శత్రువు శరీరాన్ని తాకి విరిగింది కాదు. ఏ రాతికో, చెట్టుబోదెకో గట్టిగా తగిలి విరిగిపోయి వుంటుంది,'' అన్నాడు.

''అలా జరిగివుంటే విరిగిపోయిన ముక్క ఆ పరిసరాల్లోనే ఎక్కడో దొరికి వుండాలికదా? ఇంతకూ, యీ వస్తువులు కనుక్కున్న ఆ బోయవాడి మాటేమిటి?"



అంటూ మంత్రి ధర్మమిత్రుడు, హారాన్నీ, కత్తినీ అరణ్యం నుంచి తెచ్చిన సేవకుడి కేసి చూశాడు.

సేవకుడు ముందుకు వచ్చి మంత్రితో, ''అయ్యా, ఆ బోయవాడు మనం అడిగిన దానికి ఖుద్దిగా జవాబు చెప్పే స్థితిలో లేడు. వెర్రిచూపులు చూస్తూ, మధ్య మధ్య, 'రెండుకాళ్ళ మొసలి!' అంటూ కేకలు పెడుతున్నాడు. వాడి కేదో భూతం పట్టిందని, వాడి బంధువులు వైద్యుడి చేత మంత్రాలు వేయిస్తున్నారు. నేను యీ కత్తి, హారం యువరాజూ, యువ రాణులవేమో అని అనుమానించి, యిక్కడికి తీసుకువచ్చాను,'' అన్నాడు.




ఈ జవాబు వింటూనే సిద్ధసాధకుడు అదిరిపడి, ''మహారాజా! మహాకాలుడి పరివారంలోని పిశాచాలు కొన్ని అప్పుడప్పుడూ రకరకాల వేషాలతో మనుషులకు కనిపించటం లోకప్రసిద్ధమే కదా! ఆ బోయవాడికి పట్టిన పిశాచాన్ని వదలకొట్టి, వాడిచేత యీ వస్తువులు ఎలా దొరికిందీ చెప్పించగలను. అక్కడికి వెళ్ళేందుకు నాకూ, జయశీలుడికీ అనుమతి యివ్వండి,'' అన్నాడు.

యువరాజూ, యువరాణుల అపహరణకూ, యీ బోయవాడి మతిచాంచల్యానికీ ఏమైనా సంబంధం వున్నదేమో అన్న ఆలోచన కలిగింది మంత్రి ధర్మమిత్రుడికి. కనకాక్షరాజుకూ యిలాంటి అనుమానమే కలిగింది. వాళ్ళిద్దరూ ఏం చేయటమా అని తమలోతాము తర్కించుకుంటున్నంతలో జయశీలుడు, ''మహారాజా! యువరాజూ, యువరాణీ కనబడకుండాపోయిన చెట్టు ప్రాంతాలే, ఒక బోయవాడికి యీ వస్తువులు దొరికనై. వాణ్ణి మరెవరో హడలకొట్టి, మతిపోయేలా చేశారు. మేం అక్కడికి పోయి సంగతి సందర్భాలు విచారించటమే ప్రయోజనకరంగా వుంటుంది,'' అన్నాడు.

ఇందుకు రాజూ, మంత్రీ సమ్మతించారు. వెంటనే జయశీలుడూ, సిద్ధసాధకుడూ రాజసేవకులు తెచ్చిన గుర్రాల మీద బయలుదేరారు. వాళ్ళకు దారి చూపేందుకు అరణ్యం నుంచి వచ్చిన సేవకుడు తోడై, ముందుండి దారి తీశాడు. అలా ముగ్గురూ గుర్రాల మీద వేగంగా ఒకగంట తరవాత అరణ్యంలోని ఒక పెద్ద ఊడలమర్రి దగ్గిరకు చేరారు. ఆ దాపుల్లో పెద్ద పెద్ద వృక్షాలూ, పొదలూ, కొంచెం దూరంలో పెద్ద కొండా వున్నవి

ఇప్పుడు ఊడలమర్రి కింద పదీ పన్నెండుమంది బోయవాళ్ళు పోగై వున్నారు. వాళ్ళ మధ్య మతిపోయిన బోయవాణ్ణి పెడరెక్కలు విరిచికట్టి, వాడికి సాంబ్రాణిపొగ వేస్తూ, దయ్యాల

పోతొకడు; ఒక చేతిలో పాములా మెలికలు తిరిగివున్న కర్రా, రెండవ చేతిలో వేప మండలూ పట్టుకుని గంతులు వేస్తూ, '' హాం, హర్ హర్, ఫట్ ఫట్ ! '' అంటూ కేకలు పెడుతున్నాడు.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ గుర్రాలను అంతదూరంలోనే దిగి, ఊడలమర్రి కిందికి పోయారు. సిద్ధసాధకుడు తలాడిస్తూ, ఏదో గొణుగుతున్న బోయవాడి కేసీ, కేకలు పెడుతూ గెంతుతున్న దయ్యాలపోతు కేసీ ఒకసారి చూసి, తన చేతిలోని పొన్నుకర్రను పైకెత్తి, '' ఆగండి ! ఆగండి! '' అంటూ అరిచాడు.

దయ్యాలపోతు, సాధకుడి కేసి కోపంగా చూసి, పళ్ళు కొరుకుతూ అతడి మీదికి దూకబోయేసరికి, రాజసేవకుడు అతడికి అడ్డుపడి, '' ఓయ్, దయ్యాలపోతూ ! ఈ వచ్చిన దెవరనుకుంటున్నావు ? రాజుగారి ఆస్థానమాంత్రికుడు, '' అన్నాడు.

సేవకుడి మాటలు వింటూనే దయ్యప్పోతు అదిరిపడి, గుడ్లు తేలవేసి, సిద్ధసాధకుడి కేసి భయంగా చూడసాగాడు. సాధకుడు ఒకడుగు ముందుకు వేసి, దయ్యాలపోతుతో, '' ఒరే, నీచగ్రహోపాసకపు వెధవా ! నే నెవరనుకుంటున్నావు ? నా మంత్రశక్తితో నిన్ను గడ్డిపోచగా మార్చి, చిటికెన వేలికి చుట్టుకోగలను, '' అన్నాడు కళ్ళెర్రచేసి.

దయ్యప్పోతు, '' తప్పయింది, క్షమించండి ! '' అంటూ సిద్ధసాధకుడి కాళ్ళ






మీద పడిపోయాడు. సాధకుడు వాణ్ణి పాదంతో పక్కకునెట్టి, జుట్టుపీక్కుంటూ పిచ్చి చూపులతో చుట్టూ కలయచూస్తున్న బోయవాడి దగ్గిరకు పోయి, ''ఒరే, బోయ భీమన్నా! నిన్ను బెదరకొట్టిన రెండుకాళ్ళ మొసలిని, యిదుగో, యీ వీరయువకుడు జయశీలుడు గుండెల్లో కత్తి గుచ్చి చంపాడు. ఇక నీకు భయం లేదు, లేచి నిలబడు!'' అన్నాడు.

బోయవాడు ఆ మాటలు అర్థమై, అర్థంకాని స్థితిలో కనుబొమలు ముడిచి, సాధకుడి కేసి వింతగా చూడసాగాడు. అక్కడవున్న వాడి బంధువుల్లో ఒకడు ఎదురుగా చూస్తూ సాధకుడితో, ''అయ్యా, వీడి పేరు, భీమన్న కాదు; రామన్న!'' అన్నాడు.

''ఈ క్షణం నుంచీ వీడు భీమన్నే! నా వాక్కుకు తిరుగులేదు. జయశీలా! ఏదీ రెండుకాళ్ళ మొసలి గుండెల్లో దించిన నీ కత్తి రక్తాన్ని, యీ బోయ భీమన్నకు చూపు.'' అంటూ జయశీలుడి కత్తిని, తానే ఒరలో నుంచి లాగుతూ, ఆ సమయంలో దాని మొనకు ముఖాన పెట్టుకున్న కుంకం యింత తీసి చప్పున రాశాడు.

సిద్ధసాధకుడు చూపిన కత్తి కేసి బోయవాడు ఒక క్షణకాలం కన్నార్పకుండా చూసి, చప్పున లేచినిలబడి, ''దొరా, ఆ రెండు కాళ్ళమొసలి పిశాచాన్ని చంపారా? దాని శవం ఎక్కడ?'' అన్నాడు.

ఈ జరుగుతున్నదంతా జయశీలుడు కొంచెం దూరంలో నిలబడి శ్రద్ధగా చూస్తున్నాడు. సిద్ధసాధకుడు ఏదో అతి తెలివికిపోయి, లేని చిక్కులు తెస్తాడని అతడికి అనుమానంగా వున్నది. అతడివన్నీ మోసపు మాటలని బోయవాళ్ళు గ్రహిస్తే, అప్పుడు వాళ్ళు తిరగబడటం, తప్పనిసరై తాను కత్తి ఉపయోగించవలసి రావటం జరగవచ్చు!

జయశీలుడు యిలా ఆలోచిస్తున్నంతలో, సిద్ధసాధకుడు ఏ మాత్రం తొణకుండా, బోయవాడితో, ''ఒరే, లోకంలో మనిషి చచ్చి శవం అవుతాడుగాని, పిశాచం చచ్చి శవం కావటం జరుగుతుందా? ఆ మొసలిపిశాచాన్ని, నా మంత్రంతో కాల్చి బూడిదచేసి, విభూదిగా శరీరానికి రాసుకున్నాను. ఇక నీ కొచ్చినభయం లేదు. ఆ ముత్యాల హారం, విరిగిన కత్తీ, ఎక్కడ దొరికినయ్యో, ఆ మొసలిపిశాచం నీతో ఏమన్నదో చెప్పు,'' అన్నాడు.

బోయవాడి కింకా పూర్తిగా భయం వదల్లేదు. వాడు దాపులనేవున్న తన బంధువుల కేసీ, తలవంచుకుని నిలబడివున్న దయ్యాలపోతు కేసీ ఓసారి చూసి, సాధకుడితో, ''దొరా, హారాన్నీ, కత్తినీ ఆ రెండుకాళ్ళ మొసలి పిశాచే ఎత్తుకుపోయినట్టుంది,'' అన్నాడు.

అప్పుడు రాజుగారి సేవకుడు బోయవాడితో, ''ఒరే, ఆ విలువైన వస్తువులు రెండూ నేను తీసుకుపోయి రాజుగారికిచ్చాను. నేను వాటిని తీసుకున్న సమయంలో నువ్వు పిచ్చిగా కేకలు పెడుతూ, నేలమీదపడి దొర్లుతున్నావు. ఆ సంగతి నీకు తెలియదు; నీ బంధువుల్ని అడుగు,'' అన్నాడు.




బోయవాళ్ళల్లో ఒకడు, ''రాజుగారి మనిషి చెప్పిందే సరిరా, రామన్నా!'' అన్నాడు.

ఆ జవాబుతో బోయవాడు తృప్తిపడి, సిద్ధసాధకుడితో, ''దొరా! ఈ ఊడల మర్రి పిశాచాల పుట్ట. రాజుగారి పిల్లలిద్దరూ యిటు వచ్చినప్పుడు, యిక్కడి పిశాచాలే వాళ్లను ఎత్తుకుపోయి వుంటవి,'' అన్నాడు.

ఆ జవాబుకు జయశీలుడు విసుగు పడుతూ తలాడించి, సాధకుడితో, ''సాధకా, అనవసర కాలయాపన ఎందుకు? మనం యిక్కడి కొచ్చింది, యువరాజూ, యువరాణులను ఎత్తుకు

పోయిన వాళ్లెవరో తెలుసుకునేందుకు. ఏవైనా ఆధారాలు దొరుకుతవేమో అనే కదా? ఆ సంగతి త్వరగా తెలుసుకో," అన్నాడు.

"ఒరే, భీమన్నా! ఆ హారం, కత్తీ నీ కెక్కడ దొరికనై? నువ్వనే ఆ మొసలి పిశాచి అరణ్యంలో నీ కెక్కడ తటస్థ పడింది? ఆ వివరా లేవో చెప్పు," అన్నాడు సిద్ధసాధకుడు.

బోయవాడు ఒకసారి గొంతు సవరించుకుని, "దొరా, యీ రోజు చీకటివేళ నేను, విల్లంబులు తీసుకుని వేటకు బయలుదేరాను. ఆ కనబడే మద్దిచెట్టు కొమ్మల్లోంచి అడవి కోడిపుంజు కూత వెయ్యటం వినిపించింది. నేను నక్కుతూ వచ్చి దాన్ని బాణంతో కొట్టాను. కాని బాణం దానికి ఆయువుపట్టున తగల్లేదు; రెక్కలో గుచ్చుకున్నది. పుంజు పెద్దగా అరుస్తూ పైకి లేచి, బాణం అడ్డుపడగా, ఎగరలేక ఆ కనబడే పొదలో పడి పోయింది," అన్నాడు.

జయశీలుడు, బోయవాడి మాటలకు అడ్డొచ్చి, "ఏదీ, నువ్వనే ఆ పొద ఏదో చూపించు! త్వరగా పద. యిక్కడ చాలా ముళ్ళ పొదలున్నవి గదా," అన్నాడు.

బోయవాడు, జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ గుబురుగా వున్న ఒక రేగుపొద దగ్గరకు తీసుకుపోయాడు. జయశీలుడు, బోయవాణ్ణి, "ఈ పొదలోనేనా, నీకు ముత్యాలహారం, విరిగిన కత్తీ దొరికింది?" అని అడిగాడు.

"అవును, దొరా!" అన్నాడు బోయవాడు భయపడిపోతూ.

బోయవాడు మాట పూర్తిచేసే లోపలే సిద్ధసాధకుడు వంగి పొదలోకి చూస్తున్నవాడల్లా ఎగిరి గంతేసి, "జయశీలా! మహారణ్యం మధ్యలోని, ముళ్ళ రేగు పొదలో, పురాతన తాళపత్ర గ్రంథం! జై, మహాకాళా!" అంటూ పొదలో నుంచి, ఒక చిన్న తాళపత్రాల కట్టను బైటికి లాగాడు. —(ఇంకావుంది)






# వ్యర్థమైన వరపరీక్ష

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీది గొప్ప ఆశయమే కావచ్చు. కాని గొప్ప ఆశయాలు ఒక్కొక్కసారి ఫలించకపోవటమే గాక, అనుకోని చిక్కులు కూడా తెచ్చిపెడతాయి. అందుకు నిదర్శనంగా నీకు సువర్ణకుమారి వివాహ వృత్తాంతం చెబుతాను, శ్రమతెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం చంద్రగిరిని రవివర్మ అనే రాజు పాలించాడు. ఆయన సంతానం ఒకే ఒక కూతురు. ఆమె పేరు సువర్ణకుమారి. రవివర్మ ఆమెను కొడుకులాగానే పెంచి, ఆమెకు యుద్ధవిద్యలన్నీ నేర్పించాడు. ఆమె ప్రజ్ఞ ఎలాటిదోగాని,

## బేతాళ కథలు

విలు విద్యలోనూ, కత్తి సాములోనూ ఆమె అందరినీ మించిపోయింది. చంద్రగిరి రాజ్యంలో ఆమెను ఆ విద్యలలో ఓడించగల వాళ్ళు ఒక్కరు కూడా లేక పోయారు. అంత చిన్న వయసులోనే ఆమె తండ్రి వెంట రెండు, మూడుసార్లు యుద్ధాలు చేసి, అసాధారణమైన ధైర్య సాహసాలు ప్రదర్శించి, తండ్రికి విజయం చేకూర్చింది. యుద్ధరంగంలో ఆమె అమిత భయంకరమైనది. అయినా అందానికి అప్సరస.

సువర్ణకుమారికి వివాహమాడే వయసు వచ్చింది. తన కుమార్తెకు సరి అయిన వీరుడే భర్త కావాలన్న ఉద్దేశంతో రవివర్మ, ఆమెను యుద్ధ విద్యలలో గెలిచిన వాడికే ఆమెనిచ్చి పెళ్ళిచేస్తాననీ, ఫలానా రోజున పోటీ జరుగుతుందనీ చుట్టుపక్కల దేశాలన్నిటా చాటింపు వేయించాడు.

నిజానికి ఆమెను పెళ్ళాడటానికి ఎందరో రాజకుమారులు సిద్ధంగానే ఉన్నారు. ఆమెను పెళ్ళాడిన వారికి చంద్రగిరి రాజ్యం కూడా వస్తుంది. అయినప్పటికీ పోటీ ఏర్పాటైన రోజుకు ఒక్క రాజకుమారుడు కూడా రాలేదు. ఈ కొత్త రకం స్వయంవరం చూడటానికి అనేక దేశాల ప్రజలు మాత్రం తండోప తండాలుగా వచ్చారు.

రాజకుమార్తె పోటీకి సిద్ధమై నిలబడింది. కాని అంతమంది జనంలో



నుంచీ ఒక్కడు కూడా ముందుకు రాలేదు. అదిచూసి అందరూ ఆశ్చర్య పడ్డారు. అంతలో ఒక ఆటవికుడు ముందుకు వచ్చి, రవివర్మతో, "మహా రాజా, నేను యువరాణిగారితో పోటీ చేస్తాను. ఏ విద్యలలో పోటీ చెయ్య మన్నారు?" అని అడిగాడు. అతను నిజంగా ఆటవికుడు కాడు, ఆటవికుడి వేషంలో వచ్చిన రాజకుమారుడు సుధీరుడు. అతను ప్రసన్నదేశపు యువరాజు.

సువర్ణకుమారి అతనితో, "నేను ప్రదర్శించే విలువిద్య నువు కూడా ప్రదర్శించు," అంటూ విల్లు తీసుకుని, ఒక దాని వెనక ఒకటిగా రెండు బాణాలను ఆకాశంలోకి వదిలింది. కొద్దిసేపట్లో అవి ఒకదానికొకటి గుచ్చుకుని, జంటగా కింద పడ్డాయి. జనం అమితంగా హర్షించారు.

ఆమె తన విల్లునూ, బాణాలనూ సుధీరుడికి అందించింది. అతను ఒక దానికి వెనకగా ఒకటి చొప్పున మూడు బాణాలు ఆకాశంలోకి వదిలాడు. అవి మూడూ ఒకదానికొకటి గుచ్చుకుని, ఒక నిడుపైన బాణంలాగా కింద పడ్డాయి. చూసేవాళ్ళ హర్షధ్వానాలు మిన్ను ముట్టాయి.

తరవాత పోటీ కత్తి యుద్ధం. సువర్ణ కుమారి రెండు చేతులా రెండు కత్తులు పట్టుకున్నది. సుధీరుడికి కూడా రెండు కత్తు లిచ్చారు. ఇద్దరూ కత్తి యుద్ధం చేస్తుండగా సుధీరుడి కుడి చేతిలో కత్తి





ఎగిరిపోయింది. మరుక్షణమే అతను తన ఎడమ చేతి కత్తితో సువర్ణకుమారి చేతులలో ఉన్న రెండు కత్తులనూ ఎగరగొట్టి, తన కత్తిని భూమిలో గుచ్చేశాడు.

తన కూతురిని మించిన అల్లుడు దొరికినందుకు రవివర్మ ఎంతో సంతోషించి, "నేను చేసిన ప్రకటన ప్రకారం నా కుమార్తెను నీ కిచ్చి పెళ్ళి చేస్తాను. నా అనంతరం నువు ఈ దేశాన్ని పాలించు," అని సుధీరుడితో అన్నాడు.

సుధీరుడు రవివర్మతో, "నేను ఈమెను పెళ్ళాడటానికి రాలేదు. ఓడించటానికి వచ్చాను. ఓడిన రాజకుమార్తెను పెళ్ళాడతానని నేనేమీ నియమం పెట్టుకోలేదు. ఆకాశంలోకి గురిగా బాణాలు వెయ్యగలవాడు చక్కగా రాజ్యం చెయ్యగలడని నేను ఎన్నడూ అనుకోలేదు. అడవిలో ఉండే వాళ్ళకు రాజ్యాలూ, రాజకుమార్తెలూ ఎందుకు?" అంటూ తాను ఎక్కివచ్చిన ఏనుగు మీద తిరిగి వెళ్ళిపోయాడు.

రవివర్మ హతాశుడయాడు. ఆయన పెట్టిన పరీక్ష విజయవంత మయింది గాని ఫలితం లేకుండా పోయింది. సువర్ణ కుమారి పెళ్ళి జరగలేదు. ఆయన తనకు నచ్చిన రాజకుమారులకు కొందరికి, తన కుమార్తెను పెళ్ళాడ వలసిందిగా కోరుతూ కబురు చేశాడు. కాని అందరూ ఏదో ఒక వంక చెప్పి ఆయన కోరికను నిరాకరించారు. రవివర్మ కుంగిపోయాడు.

కొంతకాలానికి ప్రసన్నదేశం నుంచి సుధీరుడే తాను సువర్ణకుమారిని పెళ్ళాడ గోరుతున్నట్టు రవివర్మకు కబురుచేశాడు. రవివర్మకు పెద్ద విచారం తొలగిపోయింది. ఆయన సుధీరుడికి తన కూతురు నిచ్చి వైభవంగా పెళ్ళిచేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, నాకు అనేక సందేహాలు ఉన్నాయి. సుధీరుడు తన అసలు వేషంలో రాక ఆటవికుడి వేషంలో రాజకుమార్తెతో

పోటీ చెయ్యటానికి రావటానికి కారణం ఏమిటి? ఒక ఆడదాని చేతిలో ఓడిపోతానని భయమా? లేక రాజకుమార్తె తనను గెలిచిన ఎలాటివాడినైనా పెళ్ళాడుతుందో లేదో చూడటానికా? అతను తప్ప మిగిలిన ఏ రాజకుమారుడూ రాక పోవటానికి కారణ మేమిటి? పోటీలో జయించిన తరవాత కూడా సుధీరుడు రాజకుమార్తెను పెళ్ళాడ నిరాకరించటం దేనికి? ఆమె అందచందాలు నచ్చకనా? అలాటివాడు ఆమెను పెళ్ళాడతానని తనకు తానై రవివర్మకు ఎందుకు కబురు చేశాడు? రవివర్మ అనేకమంది రాజకుమారులకు తన కుమార్తెను ఇచ్చి చేస్తానన్నా వారు ఎందుకు నిరాకరించారు? ఈ సందేహాలన్నిటికీ సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "దీనికంతకూ మూలం రవివర్మ తన కుమార్తె స్వయంవరానికి గాను ఏర్పాటు చేసిన పోటీ. అందులో ఉన్న అవివేకాన్ని సుధీరుడు రవివర్మకు స్పష్టంగానే చెప్పాడు. స్వయంవరంలో పాల్గొనే వాళ్ళు అపజయానికి ఎన్నడూ వెరవరు. రవివర్మ ఏర్పాటు చేసిన పోటీ నచ్చకనే రాజకుమారులు రాలేదు. సుధీరుడు మారువేషంలో రావటానికి కూడా అదేకారణం. రెండవసారి రాజకుమారులు సువర్ణకుమారిని పెళ్లాడ నిరాకరించటానికి కారణం, ఆమె ఒక ఆటవికుడికి ఓడి ధర్మంగా అతనికి భార్య అయింది. ఆమెను మరొకరు చేసుకోవటం మారుమనువు అవుతుంది. సుధీరుడి విషయంలో ఈ చిక్కు లేదు. రవివర్మ తన మొదటి ప్రకటనను ఉపసంహరించుకుని, ఏ రాజకుమారుడికైనా ఆమెను ఇయ్యటానికి సిద్ధంగా ఉన్నాడని విని అతను పెళ్ళాడటానికి ముందుకు వచ్చాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# అతడికంటె ఘనుడు!

ఒక వేటగాడు ఒక పునుగుపిల్లిని పట్టి, దాన్ని ఒక తెలిసిన పెద్దమనిషికి అమ్మే ఉద్దేశంతో పెట్టెలో పెట్టుకుని తీసుకుపోయాడు. అయితే ఆ పెద్దమనిషి ఇంట్లో లేడు. ఆయనగారి తమ్ముడు ఉండి, "ఆ పెట్టెలోది ఏమిటి?" అని అడిగాడు.

"ఏమీ లేదు, పునుగుపిల్లి," అన్నాడు వేటగాడు.

"దాని ఈక ఒకటి ఇస్తావా? పునుగుపిల్లి ఈక కోసం ఎన్నాళ్ళుగానో చూస్తున్నాను," అన్నాడు తమ్ముడు.

"ఈక పీకటానికి వీల్లేదులే!" అంటూ వేటగాడు తిరిగి వచ్చేశాడు.

ఆ సమయంలో వాడికి పెద్దమనిషి ఎదురుపడ్డాడు. అతను వేటగాణ్ణి, "ఆ పెట్టెలోది ఏమిటి?" అని అడిగాడు.

"ఏమీలేదు, పునుగుపిల్లి. దాన్ని మీ యింటికి తీసుకుపోయాను. మీ తమ్ముడుగారు దాని ఈక ఒకటి ఇయ్యమన్నాడు. అందుకని వచ్చేస్తున్నాను," అన్నాడు వేటగాడు.

పెద్దమనిషి నవ్వి, "మా తమ్ముడు పునుగుపిల్లి ఈక అడిగాడా? పిచ్చివాడు! తాబేలు అనుకుని ఉంటాడు!" అన్నాడు.






# తెలివిగలభార్య

శ్యామలాల్ అనేవాడు శ్రద్ధాసక్తులు గల రైతు. అతను శ్రమించి, చెమట ఓడ్చి, స్వశక్తితో చాలా ఎకరాల భూమి సంపాదించాడు. అతని కొడుకులు హీరాలాల్, మోతీలాల్ అనే వాళ్ళు. హీరాలాల్ తండ్రిలాగే శ్రమించేవాడు. మోతీలాల్ మాత్రం చాలా బద్ధకస్థుడు; ఏ పనీ చేసేవాడు కాడు.

శ్యామలాల్ పోయేనాటికి హీరాలాల్ పాతికేళ్ళవాడు. అతనికి పెళ్ళి అయి, ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. మోతీలాల్ ఇరవైఏళ్ళవాడు. తండ్రి పోగానే హీరాలాల్ తండ్రి ఆస్తిని తమ్ముడికి పంచి ఇచ్చాడు. మోతీలాల్ తల్లి వెంటనే ఉంటూ తన పొలాలను గురించి ఏమీ పట్టించుకోక, వాటిని కమతగాళ్ళకు వదిలేసి, ఊళ్ళో ఉన్న జులాయివాళ్ళతో చేరి పేకాటతో కాలక్షేపం చేశాడు.

పెద్ద పందాలతో పేకాట ఆడి, మోతీలాల్ చాలా డబ్బు పోగొట్టుకున్నాడు; తన దగ్గిర ఉన్నదంతా ఊడ్చుకుపోయాక, తల్లి వద్ద ఉన్న డబ్బంతా తీసుకుని తగలబెట్టేశాడు; ఇంకా డబ్బు కావలిసివచ్చి, తన పొలం కొంత తాకట్టుపెట్టి, తన అన్న వద్ద డబ్బు తీసుకున్నాడు. ఇలా రోజు రోజుకూ మోతీలాల్ స్థితి దిగజారిపోయింది.

వాడు ఎలా బాగుపడతాడా అని అతని తల్లికి బెంగపట్టుకున్నది. ఆమె తన భర్త పోయాక మొదటిసారిగా తన అక్కను పొరుగూళ్ళో చూడబోయి, తన కొడుకును గురించి చెప్పుకున్నది.

"వాడికి మంచి పిల్లను చూసి ముడిపెట్టు, వాడేమారుతాడు!" అన్నది అక్క.

"పిల్ల ఎవతె అయినా ఉన్నదా?" అని మోతీలాల్ తల్లి అడిగింది.

---

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

---



"మా పక్క ఇంటివాళ్ళు చాలా గౌరవస్థులు. వాళ్ళ పిల్ల శివానీ చూడ చక్కనిదీ, బుద్ధిమంతురాలూ, తెలివి గలదీనూ!" అన్నది అక్క.

తల్లి ఇంటికి తిరిగి వచ్చి, సంబంధం గురించి చెప్పింది. మోతీలాల్ పెళ్ళికి ఒప్పుకున్నాడు. పెళ్ళి ఘనంగానే జరిగింది.

పెళ్ళి అయిన కొద్ది రోజులపాటు మోతీలాల్ పేకాటజోలికి అంతగా పోలేదు. కాని రోజులు గడుస్తున్న కొద్దీ పేకాటవ్యసనం హెచ్చిపోయింది. అతను ఇంటి భాధ్యతలు కూడా పట్టించుకోవటం మానేశాడు.

"వీడు మళ్ళీ మొదటి కొచ్చాడు. ఏం చేసేటట్టు?" అని అత్తగారు శివానీతో అన్నది.

"మీరేం దిగులుపడకండి, అత్తయ్యా. ఏదో ఒక ఉపాయం చూస్తాను," అన్నది శివాని.

ఒక రోజు రాత్రి ఆమె తన భర్తతో, "మీరు కొంచెం జాగ్రత్తగా ఉండరాదూ? ఈ పేకాటతో ఉన్నదంతా ఊడ్చిపెట్టుకుపోతుందేమో?" అన్నది.

"పెళ్లాం చేత బుద్ధులు చెప్పించుకునే మూఢుణ్ణి అనుకున్నావా? ఇంకెన్నడూ నాకు సలహాలియ్యకు," అన్నాడు మోతీలాల్.

శివానీ ఏడిచి, భర్తను నానా శాపనార్థాలు పెట్టింది.

మోతీలాల్ వాటిని లక్ష్యపెట్టక, "ప్రస్తుతం డబ్బుపోతున్న మాట నిజమే కాని మనం నెగ్గి, పోయినదంతా రాబట్టాలి. అదే జూదంలో ఉండే గమ్మత్తు. ఊరికే నసపెట్టక, పడుకో," అన్నాడు.

శివానీ దగ్గిర బంధువు ఒకాయన అగ్గిపెట్టెల పరిశ్రమలో పనిచేసేవాడు. ఆయన చాలా తెలివిగలవాడు. ఆయనకు కొన్ని ఇంద్రజాలపు ట్రిక్కులు కూడా తెలును. తన భర్తను మార్చటానికి ఆయన సహాయం తీసుకోదలచి, శివాని

తన అత్తగారితో చెప్పి, పుట్టింటికి వెళ్ళి తన బంధువుకు కబురుచేసింది. అంతా విని ఆయన ఆమెకు మంచి సలహా ఇచ్చి, సహాయపడతానన్నాడు. శివాని తిరిగి వచ్చింది.

ఒక రోజు మధ్యాన్నం మోతీలాల్ స్నానానికి పోబోతూండగా మోతీలాల్ గదిలో మంటలేచి, అతని బల్ల మీది కొన్ని కాగితాలూ, పుస్తకాలూ మండాయి.

"నిప్పు! నిప్పు!" అని శివానీ కేకలు పెట్టింది. మోతీలాల్ పరిగెత్తుకుంటూ వచ్చి మంటలు ఆర్పేశాడు.

"చిత్రంగా ఉందే! ఆ బల్ల మీద నిప్పు ఎలా వచ్చిందీ? సమయానికి నువు చూశావు గనక సరిపోయింది. లేకపోతే ఇల్లంతా కాలి బూడిద అయి ఉండునే!" అన్నాడు మోతీలాల్.

"నేను పక్క సరిచేస్తుండగా పొగ కనిపించింది. వెంటనే భగ్గున మంట లేచింది. కేకలు పెట్టాను," అన్నది శివాని.

మర్నాడు నిద్ర లేస్తూనే శివాని తనకు వచ్చిన కల తన భర్తకు చెప్పింది. వెలిగిపోతున్న రథం మీద ఒక ఋషి వాళ్ళ ఇంటికి వచ్చాడట. ఆయన ఆమెతో, "తల్లీ, జాగ్రత్త. పేకముక్కలు సర్వనాశనం చెయ్యటానికి మీ ఇంట ప్రవేశించాయి. వాటితో మీకు గల సమస్తమూ తుడిచిపెట్టుకు పోతుంది," అన్నాడట.





చదువుతూ పేకముక్కలను గబగబా కలుపు. వాటి ప్రభావం నీకే తెలుస్తుంది,'' అన్నాడట.

ఇదంతా చెప్పి శివాని, '' నా కిలాటి కలలలో నమ్మకం లేదు సుమండీ. సరదాకు చేసి, ఏం జరుగుతుందో చూద్దామా ? '' అన్నది.

'' ఏమిటే, శివానీ ? '' అంటూ అత్త గారు అక్కడికి వచ్చింది.

శివాని ఆమెకు తన కల గురించి అంతా చెప్పింది.

'' శివానీ, నీకు నమ్మకం లేకపోతే పోనీ, నన్ను చేసి చూడనియ్యవే. శని వారం రోజంతా నేను ఉపోషం ఉండి, ఏం జరుగుతుందో చూస్తాను,'' అన్నది అత్తగారు.

'' మీకేమన్నా పిచ్చా, అత్తయ్యా? కలలను ఎవరైనా నమ్ముతారా ? '' అని శివానీ తన అపనమ్మకాన్ని సూచించే టట్టుగా తలాడించి, నవ్వుతూ భర్త కేసి చూసింది.

శనివారం ఉదయం మోతీలాల్ తల్లి తన కొడుకుతో, '' మోతీ, ఇవాళ పేకాటకు వెళ్ళకు, నాయనా! నీ పేక ముక్కలు నాకియ్యి. ఏం జరిగేదీ చూడాలి. ఇవాళ ఉపోషం ఉంటు న్నాను,'' అన్నది.

'' లేదు, స్వామీ. వాటితోనే మాకు ఐశ్వర్యమూ, ఆనందమూ వస్తాయి. ఇప్పుడు నష్టం జరుగుతున్నా, నా భర్త కాలక్రమాన పోయినదంతా రెట్టింపుగా, వడ్డీతో సహా గెలుస్తారు,'' అని తాను అన్నదట.

ఆయన పెద్దగా నవ్వి, '' అమ్మాయీ, కావాలంటే వచ్చే శనివారం నేను చెప్పి నట్టు చేసి చూడు ; స్నానంచేసి, రోజల్లా ఉపవాసం ఉండి, పేకముక్కల మీద ఇంత గంగాజలం చల్లు. ముందు వాటిని ఒక కొత్త గుడ్డలో మూటగట్టు. గంగా జలం ప్రోక్షించిన తరవాత, ' ఓం కరమ్, ఓం కరమ్ సర్వమ్ ! ' అని మంత్రం

"నువు నిజంగా, కలలో చెప్పినట్టు చెయ్యబోతున్నావా, అమ్మా?" అని మోతీలాల్ అడిగాడు.

"అవును, నాయనా! నిజంగానే చేసి చూస్తాను," అన్నది తల్లి.

"పేకముక్కలు ఇప్పుడియ్యను. మధ్యాన్నం నుంచీ తీసుకో నా పేకాట మాన్పించటానికి ఇదో వంక!" అన్నాడు మోతీలాల్.

అతను మధ్యాన్నం ఇంటికి తిరిగి వచ్చి, పేకముక్కలను బల్ల మీద పెట్టి, స్నానానికి వెళ్ళాడు. స్నానం చేసి, భోజనం చేసి, అతను నిద్రపోయాడు.

చీకటి పడే వేళకు తల్లి వచ్చి, మోతీలాల్‌ను లేపి, ప్రయోగం చెయ్యబోతున్నానన్నది. శివానీ వచ్చి, "ఏమిటో అంతా అత్తయ్య పిచ్చి!" అని నవ్వింది. భార్యాభర్తలు మొహాలు చూసుకుని నవ్వుకున్నారు.

మోతీలాల్ లేచి, బల్ల మీద ఉన్న పేకముక్కలను పోగుచేసి, తల్లికి ఇచ్చాడు. ఆమె ఒక బుడ్డిలో గంగాజలం తెచ్చి, వాటి మీద చల్లి, వాటిని కొత్త గుడ్డలో కట్టి, ముక్కల్ని కుదిలించి, బలంగా రుద్దింది, మంత్రాలు చదువుతూ.

పేకముక్కలలో నుంచి పొగలూ, మంటలూ వెలువడ్డాయి. ఆమె ఆ ముక్కలను నేల మీద పడేసింది. అవి మండి బూడిద అయిపోయాయి.



అది చూస్తున్న ముగ్గురి ముఖాలలోనూ ఆశ్చర్యం తాండవించింది.

"చూశావా, శివానీ? నీ కల అక్షరాలా నిజమయింది!" అన్నాడు మోతీలాల్ గద్గద కంఠంతో.

"ఈ మాత్రానికే భయపడతారుటండీ? మీ జూదం మీరు మానకండి. ఎప్పటికైనా పోయినదంతా తిరిగి రాకపోదు," అన్నది శివానీ.

కాని మోతీలాల్ గుండె జారిపోయింది. పెద్ద చప్పుడుతో అతను చతికిల బడి పోయాడు. మర్నాటి నుంచీ అతను పేకాట మానేశాడు. అతను పూర్తిగా మారిపోయి, శివానీ ప్రోత్సాహంతో పని పాటలు ప్రారంభించాడు. అతని వెంట శివాని కూడా పొలానికి వెళుతూ వచ్చింది. అతని అన్న తాను తాకట్టు ఉంచుకున్న పొలాలు అతని పరంచేసేశాడు. మోతీలాల్ మంచి వ్యవసాయదారుగా తయారయాడు. ఈ విధంగా శివాని కృషి ఫలించింది.

ఇంతకూ ఆమె ఏం చేసింది? ఆమె బంధువు ఆమెకు రెండురకాల పదార్థాలు ఇచ్చాడు. ఒకటి నిప్పుపెట్టె పక్కలకు పూసేది. రెండోది నిప్పు పుల్లల తలలలో ఉండేది. శనివారంనాడు మోతీలాల్ నిద్రపోతున్నప్పుడు శివాని పేకముక్కల నుంచి ఇస్పేటు ఆసూ, కళావరు ఆసూ విడిగా తీసి, వాటి చుక్కలమీద ఒక్కొక్క మందు పూసి, మందు ఆరిపోయాక రెంటినీ ఎదురెదురుగా, మందులు ఒక దాని కొకటి తగిలేలాగా పెట్టి, మిగతా ముక్కలమధ్య పెట్టేసింది. శివాని సలహా పైన ఆమె అత్తగారు గంగా జలానికి బదులు అరఖు (ఆల్కహాల్) చల్లింది. దాని వాసన తెలియరాకుండా అగరు వత్తులూ అవీ అంటించారు. పేకముక్కలను గట్టిగా రుద్దేటప్పుడు రెండు ఆసుల మధ్యా ఒరిపిడికి నిప్పు పుట్టింది. అరఖు మూలకంగా అది చూస్తూండగానే జ్వాలగా మారింది. మోతీలాల్‌కు ఇదేదీ తెలియదు.



# 173. "ఏడు పొయ్యిలు"

జపానుకు చెందిన గంకై సముద్రతీరాన, కొండలశ్రేణిలో సముద్రం తొలిచిన ఏడు గుహలున్నాయి. "ననత్సుగమ" అని వీటికి పేరు; అంటే ఏడు పొయ్యిలు అని అర్థం. సముద్రం పోటులో ఉన్నప్పుడు పడవలవాళ్ళు యాత్రీకులను ఈ గుహల లోపలికి తీసుకుపోతారు. వీటికి "సహజ స్మృతి చిహ్నాల" హోదా ఇయ్యబడింది. ఈ ప్రాంతానికి రావాలంటే కరత్సు నుంచి నేల మార్గాన బస్సులో రావటానికి అరగంట పట్టుతుందట.





# అచ్చిరాని షరతులు

ఒక ఊరి జమీందారుకు అకస్మాత్తుగా దానకర్ణుడు అని పేరు తెచ్చుకోవాలని బుద్ధి పుట్టింది. అయితే ఆయన స్వత హాగా లోభి. దానం కోరి వచ్చినవాణ్ణి ఏదో వంకన అవతలికి పంపడమే ఆయన ఉద్దేశం; అందుచేత డబ్బు ఇవ్వనని సూటిగా చెప్పటానికి బదులు, డబ్బు ఇయ్యటానికి ఏదో ఒక షరతు పెడుతూ ఉండేవాడు.

ఆ ఊళ్ళోనే రంగడు అనే అనాథ ఒకడు ఉండేవాడు. వాడు ఊళ్ళో అందరికీ పనులు చేసిపెట్టుతూ, తన జీవితం వెళ్ళబుచ్చుకుంటున్నాడు. జమీందారుగారు దానధర్మాలు చేస్తున్నా డని విని రంగడు ఆయనను చూడ బోయాడు.

"ఎవరు నువ్వు?" అని జమీందారు అడిగాడు.

"ఎవరికీ తెలీని అభాగ్యుణ్ణి బాబయ్యా. తమరు కనికరిస్తే దానం పుచ్చుకుందామని వచ్చాను," అన్నాడు రంగడు.

"నిజంగానే నిన్ను ఎవరూ ఎరగరా? నిన్ను ఎరగని వాళ్ళను ఎంతమందిని తెస్తే, అన్ని వందల వరహాలు నీ కిస్తాను," అన్నాడు జమీందారు.

"దానికేం భాగ్యం?" అని రంగడు బయలుదేరబోతూంటే, జమీందారు వాణ్ణి ఆపి, "ఇదుగో చూడు! ఏ రోజు నువ్వు మొట్టమొదట చూసిన మనిషి నిన్ను ఎరగనంటాడో, వాణ్ణే తీసుకు రావాలి. ఆ తరవాత చూసిన వాళ్ళు పనికిరారు," అన్నాడు.

సరే నన్నాడు రంగడు. ఆ రోజు వాడు మొదట చూసిన మనిషి వాణ్ణి ఎరిగిన వాడే. మర్నాడు రంగడు తెల్లవారకుం

డానే లేచిపోయి, తనకు అట్టే పరిచయం లేని వీధిలోకి వెళ్ళి, ఒక సందులోకి తిరగబోతూండగా, అక్కడొక బిచ్చగాడు తగిలి, "ఎవరది, రంగడా ? ఏం బాబూ, ఇంత పెందలాడే ఈ వీధి కొచ్చావు ?" అని అడిగాడు. ఆ రోజుకు నూరు వరహాల అవకాశం పోయింది. ఆ బిచ్చగాడికి ఒక కాలు లేదు. ఎప్పుడో ఆ బిచ్చగాడి కర్ర పడిపోతే, రంగడు వాణ్ణి లేవదీసి, కర్ర అందించాడు. ఆ విధంగా రంగడు ఆ బిచ్చగాడికి బాగా గుర్తున్నాడు.

ఆ మర్నాడు రంగడు ఊరి పొలిమేరలోకి పోయాడు. ఎవరో పొరుగూరు నుంచి వస్తూ ఉండటం చూసి రంగడు చాలా సంబరపడ్డాడు. ఆయన ముఖం రంగడికి గుర్తు రాలేదు.

"అయ్యా, మీరెవరో నాకు తెలీదు. శ్రమ అనుకోక ఒక్కసారి నాతో జమీందారుగారింటికి వస్తారా ?" అని రంగడు ఆయనను అడిగాడు.

ఆయన వాణ్ణి ఎగాదిగా చూసి, "నువు రంగడివి కాదూ? ఇప్పుడు జమీందారుగారి ఇంటికి పోవలసిన అవసరం ఏమిటి ?" అని అడిగాడు.

రంగడు నిస్పృహగా, "అవునులెండి. అవసరంలేదు," అని ఆయన వెనకనే వచ్చేశాడు. ఆయన గ్రామకరణంగారి మామగారు. ఒకరోజు రంగడు ఆయనకు కాళ్ళు పట్టాడు. అందువల్ల ఇవాళ





రంగడు నూరు వరహాల అవకాశం పోగొట్టుకున్నాడు.

రోజుకు నూరేసి వరహాల చొప్పున కొన్ని వేల వరహాలు పోగుచేసి ధనికుడై పోవాలనుకున్నాడు రంగడు. కాని అలా కుదరడం లేదు. ప్రతిరోజూ ఎక్కడికి పోయినా, ఏ సమయంలో అయినా రంగడికి తెలిసినవాళ్ళే తగులుతున్నారు.

ఇక ఇది పని కాదనిపించి, రంగడు ఆ గ్రామం వదిలిపెట్టాడు. ఒక్క నూరు వరహాలైనా సంపాదించాలని వాడి ఆశయం. ఒకరాత్రి అంతా నడిచి రంగడు ఒక గ్రామం చేరుకున్నాడు. బాగా అలిసి పోయి ఉండటంచేత వాడికి ఎక్కడన్నా నడుము వాల్చాలనిపించింది. వాడు ఒక ఇంటి తలుపు తట్టాడు. ఇంటావిడ కాబోలు కొడుకుని తిట్టుతూ, "పొద్దున్నే లేచి ఇలా ఏడిపిస్తున్నావు. నేను పోతే, పొరుగూళ్ళో రంగడి లాగ వాళ్ళకూ, వీళ్ళకూ చాకిరీ చేస్తూ బతకాలిసిన గతి పట్టుతుంది, వెధవా!" అంటున్నది.

ఆమె తలుపు తెరిచేసింది. ఆమె ముఖం చూడకూడదనుకుంటూనే చూసేశాడు రంగడు. ఆ రోజుకు నూరు వరహాల అవకాశం పోయింది.

ఆ ఇల్లాలు చాలా మంచిది. ఆమె ఆ పూటకు రంగడికి ఆశ్రయం ఇచ్చింది. వాడు ఒక కునుకు తీసినాక ఆమె వాడికి అన్నం పెట్టింది. తన పేరు ఆ ఊళ్ళో వాళ్ళు సామెతగా చెప్పుకుంటున్నారు గనక రంగడు మరో ఊరు వెళ్ళాడు.

అక్కడా వాడికి దురదృష్టమే ఎదురయింది. రంగడు ఉండే ఊళ్ళోని ఒక రైతు కూతుర్ని ఆ ఊరే ఇచ్చారు. ఆ ఊరిలో అడుగు పెట్టుతూనే రంగడు మొదట ఆమెనే చూశాడు. ఆమె వాణ్ణి అప్యాయంగా పలకరించి, ఒకరోజు తన ఇంట ఉంచుకున్నది.

తాను ఊరు విడిచి ఇలా దూరం రావటంలోని పొరపాటు రంగడు గ్రహించాడు. ఇప్పుడు తనకు తెలియని మనిషి

కనిపించినా, ఆ మనిషిని తన ఊరి జమీందారు దగ్గిరికి తీసుకుపోవటం సాధ్యం కాదు. అందుచేత రంగడు తన తిరుగుడు కట్టిపెట్టి, ఒక కొత్త ఊళ్ళో వాళ్ళకూ, వీళ్ళకూ పనులు చేస్తూ, జీవితం గడపసాగాడు.

ఇలా ఇరవై ఏళ్ళు గడిచాయి. రంగడి జీవితంలో ఏ మార్పు లేదు. ఒకసారి వాడికి తన పాత గ్రామం చూడాలని పించింది. వాడు చాలా శ్రమపడి అక్కడికి చేరుకున్నాడు. ఇరవై సంవత్సరాలలో ఊరు చాలా మారింది. రంగణ్ణి ఒక్కరూ గుర్తించలేదు. ప్రజలూ మారిపోయారు.

పాత జమీందారు బతికి ఉంటే తాను ఇప్పుడు నూరు వరహాలు సులువుగా సంపాదించవచ్చు. కాని ఆయన పోయాడనీ, ఆయన కొడుకు కొత్త జమీందారు అయాడనీ రంగడికి తెలిసింది.

రంగడు కొత్త జమీందారు వద్దకు వెళ్ళి, తన కథ అంతా చెప్పుకుని, "ఇప్పుడు ఊళ్ళో నన్ను ఎవరూ ఎరగరు. రోజుకు మనిషికి నూరు వరహాల చొప్పున ఇప్పించి, మీ తండ్రిగారి మాట నిలబెట్టండి," అన్నాడు.

జమీందారు కొడుకు నవ్వి, "నువు ఎవరో నే నెరగను. నిన్ను గురించి మా తండ్రిగారు ఎన్నడూ నాతో అనలేదు. కానీ, మా తండ్రిగారి లాగే నేనూ దానకర్ణుణ్ణి. అందుచేత, ఒక షరతు పాటిస్తే నీకు దానం ఇయ్యగలను. ఏ రోజైనా



నిన్ను మొదట చూసిన మనిషి గుర్తు పట్టితే అతన్ని తీసుకురా; నీకు రెండు వందల వరహా లిస్తాను. ఈ విధంగా నువు రోజుకు రెండు వందల వరహాలు సంపాదించవచ్చు,'' అన్నాడు.

రంగడికి ఈ షరతు లాభసాటిగా కనిపించి, అక్కడినుంచి వచ్చేశాడు.

రంగడు గ్రామంలో తనను మునుపు ఎరిగి ఉండిన మనుషుల కోసం ప్రతి రోజూ వెతికాడు. రోజులూ, వారాలూ గడిచాయి, కాని వాడు ఇంకా రెండు వందల వరహాలు సంపాదించలేదు.

ఒక రోజు రంగడు తెల్లవారు ఝామునే ఊరి పొలిమేరలలో ఉండగా, ఒక గుర్రపుబగ్గి ఊళ్ళోకి వస్తూ కనబడింది. అందులో కొత్త జమీందారు ఉన్నాడు. రంగడు మహదానందపడి, ''అమ్మయ్యా, ఇన్నాళ్ళకు నన్నెరిగున్నవారు తొలిదర్శ నంలో తగిలారు. తమ ఇంటికి వస్తాను, రెండువందల వరహాలూ ఇప్పించండి.'' అన్నాడు.

''ఎవరు నువు? రెండవందల వరహా లేమిటి?'' అన్నాడు జమీందారు చిరాకుగా.

రంగడు తన కథ చెప్పాడు.

''అడ్డమైనవాళ్ళనూ గుర్తు పెట్టు కోవటం తప్ప నాకు మరోపని లేదను కున్నావా? దారికి అడ్డంలే. వెళ్ళు, వెళ్ళు!'' అన్నాడు జమీందారు ముందుకు సాగిపోతూ.

రంగడికి తన తెలివి తక్కువ అర్థ మయింది.

''ఈ గొప్పవాళ్ళు చాలా తెలివైన వాళ్ళు. చుట్టూ ఉన్న మనుషులు ఎలాటి వాళ్ళో వాళ్ళకు తెలుసు. ఆ రోజుల్లో అందరూ మంచి వాళ్ళు; చిన్న సహాయం కూడా గుర్తుంచుకునే వారు. ఇప్పుడు ఎవరికీ పక్కవాడి ధ్యాసలేదు. రోజూ చూసే వాడుకూడా గుర్తుండడు. అది తెలిసే ఆ జమీందారు అలా, ఈ జమీం దారు ఇలా షరతులు పెట్టారు,'' అను కున్నాడు రంగడు.



# లోభి ఆతిథ్యం

వెంకటాద్రి అనేవాడు గొప్ప లోభి. ఒకరోజు అతని ఇంటికి వెంకప్ప అనే బంధువు వచ్చాడు. వెంకప్ప ధోరణి చూస్తే అతను భోజనానికి ఉండేటట్టు వెంకటాద్రికి తెలిసిపోయింది.

అందుకని అతను తన భార్యతో, "ఏమేవ్, వెంకప్ప రాకరాక వచ్చాడు. భోజనానికి ఉంటాడు. ఒకటి రెండు చేసి, రెండు ఒకటి చెయ్యి," అని కేకవేసి చెప్పి, వెంకప్పతో, "నేను అలా బజారుకు వెళ్ళి వస్తాను. మీరు విశ్రాంతి తీసుకోండి," అని వెళ్ళిపోయాడు.

వెంకప్ప, తనకు ఏదో ప్రత్యేకమైన ఏర్పాటు జరుగుతున్నదని తృప్తిపడి, నడుము వాల్చి నిద్రపోయాడు. ఆయన నిద్రలేచేసరికి సాయంకాలమయింది. కడుపులో నకనకలాడుతున్నది.

వెంకటాద్రి సూర్యాస్తమయం వేళ తిరిగి వచ్చి, "ఏమేవ్, వంట అయిందా? అయితే వడ్డించు," అన్నాడు.

ఇద్దరూ భోజనాలకు కూర్చున్నారు. వెంకటాద్రి భార్య వాళ్ళకు తోటకూర ఆకు పులుసూ, తోటకూర కాడల ఇగురూ వడ్డించింది. ప్రత్యేకం ఏమీ లేనందుకు వెంకప్ప నిరాశ పడుతూ, "మీరు ఒకటిని రెండు చెయ్యటం, రెండును ఒకటి చెయ్యటం అన్నారు. దాని అర్థమేమిటి?" అని అడిగాడు.

"ఏముున్నదండీ? ధరలు మండిపోతున్నాయి కాదూ? ఇంట్లో తోటకూర తప్ప లేదు. దాన్నే రెండు రకాల ఆధరువులు చెయ్యమన్నాను. కరువుకాలం కదా! అందుచేత మధ్యాన్నం భోజనమూ, రాత్రిభోజనమూ ఏకం చేసి, సాయంకాలం భోజనం చెయ్యమన్నాను," అన్నాడు వెంకటాద్రి.

వెంకప్ప అర్థం చేసుకుని, భోజనం కాగానే సెలవు పుచ్చుకున్నాడు.

—రామచంద్రుని కొండయ్య





# సుల్తానా వడ్డీవ్యాపారం

పర్షియాకు కొత్తగా సుల్తాను అయిన సయ్యద్ అబ్దుల్లాకు వినోద ప్రదర్శనలు అంటే చాలా ఇష్టం. ఈ ప్రదర్శనల కింద అతను మొదటి సంవత్సరం రెండు లక్షల దీనారాలు ఖర్చు చేసినట్టు లెక్క తేలింది. ఏటా సుల్తానుగారి వినోదాలకు గాను రెండేసి లక్షల దీనారాలు ఖర్చు అయితే మిగిలిన పరిపాలనకు డబ్బు చాలదు.

అందుచేత సుల్తానూ, వజీరూ కూర్చుని సమాలోచన జరిపి, ఒక నిర్ణయానికి వచ్చారు. అదేమిటంటే, వడ్డీవ్యాపారాన్ని శాసనం ద్వారా ఆమోదించి, వడ్డీవ్యాపారస్థుల మీద పన్ను విధించటం. ఇందువల్ల ఎవరికీ నష్టం ఉండదు. డబ్బు ఇబ్బందిలో ఉన్నవారికి అప్పు పుట్టుతుంది. వడ్డీల కిచ్చే వారికి వడ్డీ గిట్టుబాటు అవుతుంది. పన్నులద్వారా ఖజానాకు అదనపు రాబడి ఉంటుంది.

వెంటనే సుల్తాను వడ్డీవ్యాపారాన్ని అమలులోకి తెస్తూ శాసనం ప్రకటించి, తీసుకున్న అప్పు తీర్చని వారికి శిక్షలు కూడా నిర్ణయించాడు. ఈ శాసనం అమలులోకి రాగానే ధనికులు సంతోషించారు. వాళ్ళు చాలా హెచ్చు వడ్డీలకు అప్పులు ఇయ్యసాగారు. ఇదేమంటే, "మేం గుమాస్తాల జీతాలు ఇయ్యాలి, సుల్తానుగారికి పన్ను కట్టాలి, వడ్డీ కింద మిగుల్చుకోవాలి," అన్నారు వాళ్ళు.

కొంతకాలం గడిచినాక సుల్తానాకు కొత్త శాసనం ఎలా అమలు జరుగుతున్నదో తెలుసుకోవాలనిపించింది. ఆమె తన దాసీని పిలిచి ఆ మాట అడిగింది.

"వడ్డీవ్యాపారానికే మమ్మా? బాగానే సాగుతున్నది. ధనికులు పేదల రక్తాన్ని పీల్చేస్తున్నారు. విధిలేక అప్పులు చేసిన వారు, అప్పులు తీర్చలేక జైళ్ళకు పోతు

ఎం. మోహన్‌రెడ్డి

న్నారు. నగరంలో అశాంతి హెచ్చింది,'' అన్నది దాసి.

ఈ మాట విని సుల్తానా కంపించి పోయింది. వడ్డీవ్యాపారం ప్రజోపయోగ మయినదనీ, దానివల్ల అటు ప్రజలకూ, ఇటు ప్రభుత్వానికీ లాభం ఉంటుందనీ సుల్తానుతో బాటు ఆమె కూడా నమ్మింది. కాని తీరా చూస్తే వడ్డీవ్యాపారం చాలా భయంకరమైనదిగా కనబడింది.

ఆమె సుల్తానుతో ఈ మాట అంటే సుల్తాను ఒప్పుకోలేదు. ''వడ్డీ వ్యాపారస్థులు అడిగే వడ్డీకి ఇష్టపడినవారే అప్పు చెయ్యాలి. అప్పు తీసుకుని చెల్లించక పోవటం చట్టాన్ని ధిక్కరించటమవుతుంది," అన్నాడు సుల్తాను.



"అలా అయితే, నేను కూడా వడ్డీ వ్యాపారం చేస్తాను. వెయ్యి దీనారాలు ఇప్పించండి. నేను కూడా అందరిలాగే పన్ను చెల్లిస్తాను. అది మీ ఖర్చులకు పనికి వస్తుంది,'' అన్నది సుల్తానా.

సుల్తాను యిందుకు సంతోషంగా అంగీకరించాడు.

సుల్తానా వడ్డీ వ్యాపారం చేస్తున్నట్టు దివాణంలో అందరికీ తెలిసిపోయింది. ఒక రాజభవన రక్షకుడు అవసరం వచ్చి సుల్తానా వద్ద నూరు దీనారాలు అప్పు తీసుకుని, యాభై దీనారాలు వడ్డీ కింద ఇయ్యటానికి ఒప్పుకున్నాడు. అలాగే మరొక దళాధిపతి, ఆమె వద్ద రెండు వందల దీనారాలు అప్పు తీసుకుని, యాభై దీనారాలు వడ్డీ కింద యియ్యటానికి ఒప్పుకున్నాడు. చివరకు వజీరు కూడా సుల్తానా వద్ద అయిదు వందల దీనారాలు అప్పుచేసి, నూరు దీనారాలు వడ్డీ కింద ఇస్తానన్నాడు.

కొంతకాలం గడిచింది. ఒకరోజు సుల్తాను నగర సంచారానికి ఒంటరిగా బయలుదేరి, నగరమంతా తిరిగి, ఊరి చివరకు వెళ్ళేసరికి అతనికి ఆకలి అమితంగా పుట్టుకొచ్చింది. సమీపంలో అతనికి ఒక పేదవాడి ఇల్లు కనిపించింది.



సుల్తాను గుర్రం దిగి ఆ పేదవాడి ఇంటి తలుపుతట్టాడు.

పేదవాడు తలుపు తెరిచి, సుల్తానును చూసి నివ్వెరపోయి, వంగి వంగి సలాములు చేస్తూ సుల్తానును లోనికి ఆహ్వానించాడు.

"ఆకలిగా ఉన్నది. భోజనంకావాలి," అన్నాడు సుల్తాను.

"తమరు కాస్సేపు విశ్రాంతి తీసుకోండి. నేను భోజనం ఏర్పాటు చేస్తాను," అని ఆ పేదవాడు, సమీపంలో ఉన్న ఒక ధనికుడి వద్దకు పరుగెత్తి పోయి, యాభై దీనారాలు అప్పు పుచ్చుకుని, ఆ డబ్బుతో. అమిత ఖరీదైన ఆహార పదార్థాలు కొని, ఇంటికి తిరిగి వచ్చాడు. అతని భార్య త్వరలోనే రాజోచితమైన విందు భోజనం తయారుచేసి, సుల్తానుకు వడ్డించింది.

ఆ భోజనం తింటూ సుల్తాను ఆశ్చర్యపోయాడు. అది తాను రోజూ తినే భోజనానికి ఏమీ తీసిపోదు. ఆ పేదవాడు తనకు అలాంటి భోజనం ఏర్పాటుచెయ్యటానికి అప్పు చేసి ఉంటాడని కూడా సుల్తాను గ్రహించాడు.

అందుచేత అతను రాజభవనానికి తిరిగి వస్తూనే వెయ్యి దీనారాలు వజీరుకు ఇచ్చి, "వీటిని ఫలాని చోట, ఫలాని పేదవాడికి అందజెయ్యి," అని చెప్పాడు.

ఈ సంగతి తెలియగానే సుల్తానా వజీరును తన వద్దకు పిలిపించి, తన బాకీ అరువందలూ వెంటనే చెల్లించమన్నది. చేసేదిలేక వజీరు తన చేతిలో ఉన్న వెయ్యి దీనారాల నుంచి ఆరు వందలు తీసి ఆమె కిచ్చాడు.

తరవాత ఆయన దళాధికారిని పిలిచి, "ఈ నాలుగు వందల దీనారాలనూ ఫలాని చోట, ఫలాని వాడికి చేరేటట్టు చూడు," అన్నాడు.

ఆ డబ్బు దళాధికారి చేతికి రాగానే సుల్తానా అతన్ని పిలిపించి, తనకు అతను బాకీ ఉన్న రెండు వందల యాభై

దీనారాలూ ఆ క్షణంలో చెల్లించమన్నది. విధి లేక అతను ఆమెకు రెండు వందల యాభై దీనారాలూ యిచ్చి, మిగిలిన నూట యాభై దీనారాలనూ రాజభవన రక్షకుడికి ఇచ్చి, వాటిని ఫలాని చోట, ఫలాని వాడికి ఇచ్చి రమ్మన్నాడు.

అయితే సుల్తానా వాణ్ణి కూడా పిలిచి, తనకు రావలసిన నూటయాభై దీనారాలు చెల్లించమన్నది. వాడు తన చేతిలో ఉన్న డబ్బు యావత్తూ ఆమెకు ఇచ్చేశాడు.

మరికొంత కాలం గడిచింది. ఒక రోజున ఒక ధనవంతుడు ఒక పేదవాణ్ణి దర్బారుకు తీసుకు వచ్చి, ఆ పేదవాడు తన బాకీ తీర్చలేదని ఫిర్యాదు చేశాడు.

సుల్తాను పేదవాణ్ణి, "అప్పు దేనికి చేశావు ?" అని అడిగాడు.

"ఒక రోజు తమరు మా యింట ఆతిథ్యం స్వీకరించారు. మీ ఆతిథ్యం కొరకు ఈ ధనవంతుడి వద్ద అప్పు చేసి, దాన్ని తీర్చలేకుండా ఉన్నాను." అన్నాడు పేదవాడు.

"ఆ నాడే నీకు వెయ్యి దీనారాలు బహుమానంగా పంపాను. దాన్ని ఏం చేశావు?" అని సుల్తాను అతన్ని అడిగాడు.

పేదవాడు ఆశ్చర్యపడుతూ, "నాకు ఒక్క దీనారం కూడా అందలేదు, హుజూర్ !" అన్నాడు.



వెంటనే వజీరు లేచి, అందులో ఆరు వందలు తాను అవసరంగా సుల్తానాగారి బాకీ తీర్చటానికి వినియోగించవలసి వచ్చిందనీ, మిగిలిన నాలుగు వందలూ ఫలానావాడికి యివ్వమని దళాధికారికి ఇచ్చాననీ చెప్పాడు.

దళాధికారీ, రక్షకుడూ కూడా తమ చేతిలోని డబ్బు ఉన్నపాళంగా సుల్తానా గారి బాకీ తీర్చటానికి ఇచ్చెయ్యవలసి వచ్చిందని చెప్పుకున్నారు.

"మీరు ముగ్గురూ నేరస్థులు. తీర్చ లేని అప్పులు చెయ్యటం ఒక నేరం. ప్రభుత్వం సొమ్ము వాడుకోవటం మరో నేరం. మీ ముగ్గురికీ రెండేసి సంవత్స

రాలు జైలుశిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు సుల్తాను.

తరవాత ఆయన పేదవాడి కేసి తిరిగి, "కటిక దరిద్రుడివై ఉండి అప్పు చెయ్యటంలో నీ ఉద్దేశం ఏమిటి? నేను నిన్ను విందు చెయ్యమని అడిగానా? తీర్చలేని అప్పు చేసినందుకు నీకు ఒక సంవత్సరం జైలు శిక్ష విధిస్తున్నాను,'' అన్నాడు.

అయినా సుల్తాను మనసంతా అస్తవ్యస్తంగా ఉన్నది. ఆ రాత్రి అతను సుల్తానాతో, ''ఇక నీ వడ్డీ వ్యాపారం ఆపెయ్యి,'' అన్నాడు.

''అదేమిటి? నా వ్యాపారం వల్ల నష్టమేమిటి?'' అన్నది సుల్తానా.

''నీ వ్యాపారం మూలంగా ఇవాళ నలుగురిని జైలుకు పంపాను. నీ వల్ల ఆదా అయే నూరు దీనారాలూ, రెండు సంవత్సరాలపాటూ వాళ్ళ తిండికి సరిపోతాయా, చూడు!'' అన్నాడు సుల్తాను.

వెంటనే సుల్తానా కలమూ, కాగితమూ తీసుకొని లెక్కలు కట్టి, ''సంవత్సరానికి ఆ నలుగురికీ ఎనిమిది వందల దీనారాలు ఖర్చు అవుతాయి. రెండు సంవత్సరాలకూ పదహారు వందలు!'' అన్నది.

''చూడు, నీ వడ్డీ వ్యాపారం వల్ల ఖజానాకు ఎంత నష్టమో!'' అన్నాడు సుల్తాను.

''అయితే మీరు అమలు చేసిన వడ్డీ వ్యాపారం మీద ఆదాయం ఎంత?'' అని సుల్తానా అడిగింది.

''రెండు లక్షలు!'' అన్నాడు సుల్తాను.

''ఇప్పటికి అప్పు చెల్లించని వాళ్ళు ఖైదులో ఎందరున్నారు?'' అని సుల్తానా అడిగింది.

''సుమారు ఇరవై వేల మంది,'' అన్నాడు సుల్తాను.

సుల్తానా లెక్క కట్టి గుండె బాదుకుంటూ, ''వాళ్ళ కింద ఖర్చు పది లక్షలు!'' అన్నది.

మర్నాడే నగరంలో వడ్డీ వ్యాపార శాసనం రద్దయింది.



# ఖడ్గం విలువ

ఒక గొప్ప శిల్పి ఒక ఖడ్గాన్ని ఎంతో శిల్పసౌందర్యం ఉట్టిపడేలా జిలుగు పనితో తయారు చేసి, రాజుగారు పుట్టిన రోజున తీసుకుపోయి బహుమానంగా ఇచ్చాడు. రాజు దాన్ని తీసుకుని, "ఇతనికి నూరు వరహాలిచ్చి పంపండి," అన్నాడు.

"ఇంత అపూర్వ కళాఖండానికి అంత స్వల్పమైన బహుమానమా?" అన్నాడు శిల్పి విస్మయంతో.

"చూడటానికి అందంగా ఉంటే సరా? ఇది ప్రదర్శనవస్తుశాలలో పెట్టటానికి తప్ప ఇంకెందుకు పనికివస్తుంది?" అన్నాడు రాజు.

"కళ విలువ తెలియని రాజు ఉంటే ఎంత, చస్తే ఎంత?" అంటూ తన బొడ్డు నుంచి చప్పున బాకు తీసి రాజును పొడవబోయాడు శిల్పి. రాజు వెంటనే ఖడ్గంతో శిల్పిని ఎదుర్కొని, అతని చేతిలో బాకు కింద పడగొట్టాడు.

వెంటనే శిల్పి, "నా ధూర్తత్వాన్ని క్షమించండి, మహారాజా. నేను చేసిన ఖడ్గం ఉత్త బొమ్మ కాదని రుజువు చెయ్యటానికి అలా చేశాను," అన్నాడు.

రాజు శిల్పిని మెచ్చుకుని అతనికి పదివేల వరహాలిచ్చి పంపేశాడు.





# పెళ్లాం పోరు

చంద్రయ్య రెడ్డిగారి తోటపని చూసే వాడు. రెడ్డిగారి తోటలో అన్నిరకాల కూరగాయలూ పండేవి.

చంద్రయ్య భార్య రంగమ్మ ఒకనాడు పొరుగింటి పుల్లమ్మ వడియాలు పెట్టుతూ ఉండటం చూసింది. తాను కూడా వడియాలు పెట్టాలని ఆమెకు అనిపించింది. గుమ్మడికాయ కొనాలంటే ఎంతో ఖరీదు. రెడ్డిగారి తోటలో చాలా కాయలున్నాయి. అక్కడి నుంచి చీకటి మాటున ఒక కాయ తెచ్చుకుంటే ఆయన చూడవచ్చాడా ఏమిటి?

ఇలా అనుకుని రంగమ్మ తన మొగుడికి భోజనం పెడుతూ, "నాకు వడియాలు తినాలనిపిస్తున్నది. రేపు చీకటితోనే లేచివెళ్ళి, రెడ్డిగారి తోటలో నుంచి ఒక గుమ్మడికాయ కోసి, బండిలో వేసుకుని, రహస్యంగా ఇంటికి తీసుకురా. ఇంతలో రెడ్డిగారి కొంప కూలిపోదులే," అన్నది.

"నీకేమన్నా మతిపోయిందా? అలాటి పాడుపనులు నా ఇంటా వంటా లేవు. ఇంతలో తొందరేమొచ్చింది? ఇంకా రెడ్డిగారే గుమ్మడికాయ తినలేదు. వాటిని కోసినప్పుడు ఆయన రెండు నాకు ఇయ్యనే ఇస్తాడు," అన్నాడు చంద్రయ్య.

రంగమ్మ కళ్ళు ఒత్తుకుని, "నోరు తెరిచి అడిగినందుకు బాగా చెప్పావులే! ఒక్కకాయ భాగ్యానికి తోటంతా కోసినదాకా ఆగాలా? నువ్వు చీకటి మాటున కాయ కోయటం, రెడ్డిగారు చూడవచ్చారా? ఒక్కకాయ కోసుకు వస్తే ఏం కొంప మునుగుతుంది?" అన్నది.

చంద్రయ్య ఎన్నివిధాల చెప్పినా వినక, రంగమ్మ పంతంపట్టి, చివరకు అతని చేత సరే ననిపించింది.

ఎం. కామేశ్వరరావు

చంద్రయ్య భోజనం చేసి నడుం వాల్చాడు.

రంగమ్మ గోడమీదుగా పక్క ఇంటి పుల్లమ్మను కేకపెట్టి పిలిచి, "వడియాలకు ఎంత పప్పు నానబోయాలి, వదినా?" అని అడిగింది.

"కాయను బట్టి ఉంటుంది. ఇంతకూ కాయ ఏదీ?" అన్నది పుల్లమ్మ గోడ మీదుగా తొంగి చూస్తూ.

"రేపు చీకటితో ఆయన రెడ్డిగారి తోట నుంచి తెస్తారు." అని రంగమ్మ నోరు జారి అనేసి, నాలుక కరుచుకుని, పని ఉన్న దానిలాగా అడావుడిగా ఇవతలికి వచ్చేసింది.

పుల్లమ్మకు సంగతి తెలిసిపోయింది. ఆమె ఉండబట్టలేక, అప్పటికప్పుడే పని గట్టుకుని రెడ్డిగారి ఇంటికి వెళ్ళి, సంగతి రెడ్డిగారి భార్య చెవిన వేసి చక్కా వచ్చేసింది.

రెడ్డిగారి భార్య రెచ్చిపోయి, "ఇన్నాళ్ళు మన ఉప్పు తిని ఇంత ద్రోహం చేస్తాడా? వెంటనే ఆ చంద్రయ్యను పనిలో నుంచి తీసెయ్యండి," అని భర్తకు తాను, పుల్లమ్మ ద్వారా విన్న సంగతంతా వివరంగా చెప్పింది.

రెడ్డి నవ్వి, "ఈ భాగ్యానికే వాణ్ణి పనిలో నుంచి తీసెయ్యటమా? పాపం,



ఎన్నేళ్ళుగానో నమ్మకంగా పని చేస్తున్నాడు," అన్నాడు.

"అదేంమాట? దొంగను నమ్మటమేమిటి? ఇవాళ ఇది అయింది, రేపు ఇంకోటి అవుతుంది. వాణ్ణి పని మాన్పించాలిసిందే!" అన్నది రెడ్డిగారి భార్య.

రెడ్డి మరి మాట్లాడలేదు. కాని నిజం తెలుసుకుందామని అతను చీకటితోనే తోట కేసి వెళ్ళాడు. తోట బయట తమ గూడుబండి సిద్ధంగా ఉండటం చూసి, అతను ఒక చెట్టు చాటున నిలబడ్డాడు. కొద్ది సేపట్లోనే చంద్రయ్య తోటలో నుంచి ఒక గుమ్మడికాయ తెచ్చి, బండిలో వేసి, తెర అడ్డం కట్టి, తోట తలుపు మూసి

రావటానికి వెళ్ళాడు. ఆ సందులో రెడ్డి చప్పున వచ్చి, బండిలో తెర వెనక కూర్చున్నాడు.

చంద్రయ్య ఉత్సాహంగా బండిని తన ఇంటికి తోలుకుపోయి, గుమ్మడికాయను తీసుకుని లోపలికి పోదామని తెరను పక్కకు తీసేసరికి, రెడ్డి ఒళ్ళు విరుచుకుంటూ దిగి, ''ఈ గుమ్మడికాయను మా ఇంటికి చేర్చుతున్నా వనుకుంటే మీ ఇంటికి తెచ్చావేమిటి?'' అని ఆశ్చర్యం నటిస్తూ అడిగాడు.

రెడ్డిని చూడగానే చంద్రయ్య పై ప్రాణాలు పైనే పోయాయి. తన దొంగతనం బయట పడిందని గ్రహించి వాడు చేతులు జోడించి, ''తప్పయి పోయిందయ్యా! మీకు చెప్పకుండా గుమ్మడికాయ కోసి తెచ్చుకున్నాను," అన్నాడు భయపడుతూ.

''ఇన్నాళ్ళు నిన్ను పూర్తిగా నమ్మినందుకు ఇలా చేస్తావా?'' అని రెడ్డి అడిగాడు కోపం నటిస్తూ.

చంద్రయ్య జరిగినదంతా రెడ్డికి చెప్పి, ''ఇది నేను బుద్ధిపూర్వకంగా చేసిన పని కాదయ్యా! గయ్యాళిముండ, నా పెళ్ళాం పోరు పడలేక, ఈ నీచప్పని చేశాను,'' అన్నాడు.

''అయితే నువు ఇవాళనుంచీ పనిలోకి రాకు. నిన్ను పని మాన్పించమని నా భార్య పోరు పెట్టుతున్నది. నా భార్య మాట వినటం నాకూ విధేగా? ఏమంటావు?'' అన్నాడు రెడ్డి.

చంద్రయ్య రెడ్డి కాళ్ళమీద పడి, ''ఈ ఒక్క తప్పు కాయండయ్యా!" అని ప్రాధేయపడ్డాడు.

''చూడు, చంద్రయ్యా! ఏ పని చేసినా స్వయంగా మంచి చెడ్డలు ముందుగా ఆలోచించి చెయ్యాలిగాని, పెళ్లాం చెప్పిందనో ఇంకెవరో చెప్పారనో చెయ్యటమేనా? ఇక మీదట బుద్ధిగా ఉండు. ఆ గుమ్మడికాయ ఇంట్లో నీ భార్యకు ఇచ్చి, నన్ను మా ఇంటిదాకా బండిలో దించు,'' అన్నాడు రెడ్డి.



# నాగదేవత

ఒక పేద బ్రాహ్మడు తన పొలంలో పని చేసుకుంటూ, ఆ పొలంలో ఉండిన పుట్ట నుంచి ఒక నాగుపాము బయటికి రావటం చూశాడు. ఆ పాము తన పొలానికి రక్షగా ఉన్నదనుకుని అతను రోజూ నాగదేవతను ప్రార్థించి, సాయంత్రం ఇంటికిపోయేటప్పుడు ఆ పుట్ట వద్ద మూకుడులో పాలు ఉంచేవాడు. మర్నాడు ఉదయం ఆ మూడుకులో ఒక బంగారు కాసు ఉండేది.

ఇలా చాలా రోజులు గడిచాయి. బ్రాహ్మడు కొన్ని రోజులపాటు గ్రామాంతరం వెళ్ళ వలసి వచ్చింది. అతను పుట్ట వద్ద పాలు ఉంచే పని తన కొడుక్కు అప్పగించాడు. ఆ కుర్రవాడు పుట్టలో ఉన్న బంగారమంతా ఒక్కసారే తీసుకోవాలన్న దురాశతో, పాలు తాగటానికి వచ్చిన పామును కర్రతో కొట్టాడు. పాము మండిపడి వాణ్ణి కాటువేసి చంపింది.

రెండు మూడు రోజులు గడిచాక బ్రాహ్మడు తిరిగివచ్చి, తన కొడుకు చావుకు చింతించి, మళ్ళీ పాలు తీసుకుని పుట్ట వద్దకు వెళ్ళి, నాగదేవతను స్తోత్రం చెయ్యసాగాడు.

అప్పుడు పాము పుట్ట నుంచి తల బయటకు పెట్టి, "నీ కొడుకులాగే నువూ దురాశా పరుడివి. వాడు కొట్టిన దెబ్బను నేనింకా మరవలేకుండా ఉన్నాను. వాడి చావును నువు ఎలా మరవగలిగావు? నువు ఎన్నటికీ నా స్నేహం కోసం రాకు!" అని పుట్టలోకి వెళ్ళిపోయింది.






# అందరూ అందరే!

ఒకనాటి రాత్రి ఒక గజదొంగ ఒక పేరు మోసిన కంసాలి ఇంటి నుంచి విలువైన నగలు కాజేసి, ప్రహరీగోడదూకి వస్తూ, గస్తీ తిరుగుతున్న ఆనందు డనే రక్షక భటుడి కంట పడ్డాడు. ఆనందుడు దొంగను వెంటబడి తరిమాడు. దొంగ కాలిసత్తువ కొద్దీ పరిగెత్తి ఒక పూరి ఇంట దూరాడు.

ఆ పూరి ఇల్లు అఘోరకుడు అనే మంత్రవేత్తది. ఆ మంత్రవేత్తకు అద్భుత శక్తులున్నాయని ప్రతీతి. అతనంటే అందరూ భయపడేవాళ్ళు.

ఆనందుడు పరిగెత్తుకుంటూ వచ్చి, అటూ ఇటూ చూసి, దొంగ ఆ ఇంటనే జొరబడి ఉంటాడని రూఢి చేసుకుని, తలుపు నెట్టుకుని లోపలికి వచ్చేసరికి, మంత్రవేత్తకు చిక్కి పెనగులాడుతున్న దొంగ కనిపించాడు. ఆనందుడు మంత్రవేత్త సహాయంతో దొంగను ఒక గుంజకు కట్టి, దొంగ చేతిలో ఉన్న మూట విప్పి చూసి ఆశ్చర్యపోయాడు. ఆ మూటలో దొంగతనానికి కావలసిన సరంజామా తప్ప దొంగసొత్తు ఏమీలేదు. కాని దొంగ గోడదూకి ఇవతలికి రావటం ఆనందుడు కళ్ళారా చూశాడు. దొంగ కాజేసిన సొత్తు ఏమయినట్టు?

"కాజేసిన సొత్తు ఏం చేశావో చెబుతావా, చావగొట్ట మంటావా?" అని ఆనందుడు దొంగను అడిగాడు.

దొంగ వణికిపోతూ, "నా మాట నమ్మండి. గోడదూకి లోపలికి పోబోతూ, అటుగావస్తున్న మిమ్మల్ని చూసి ఇవతలికి పరిగెత్తాను. దొంగతనం చెయ్యలేదు." అన్నాడు.

వాడు చెప్పేది అబద్ధమని తెలిసి, ఆనందుడు వాణ్ణి కొట్టబోయాడు. అప్పుడు

వీరేపల్లి జయరాంరెడ్డి

మంత్రవేత్త అడ్డుపడి, "ఎందుకొచ్చిన శ్రమ? వాడు నిర్దోషి అయితే వాణ్ణి కొట్టినపాపం నీకు చుట్టుకుంటుంది. వీడు దొంగతనం చేశాడో, లేదో నేను మంత్ర శక్తితో రుజువు చేస్తాను,'' అంటూ ఒక పెట్టె తెరిచి, అందులో నుంచి ఒక పుర్రే, కొన్ని ఎముకలూ తెచ్చాడు. తరవాత అతను ఒక ముగ్గువేసి, అందులో పుర్రెను ఉంచి, దొంగను ఒక మూల కూర్చొబెట్టాడు.

''వీడు దొంగతనం చేసి ఉంటే పుర్రె కదలదు. దొంగతనం చెయ్యని పక్షంలో పుర్రె వాడి వద్దకు వెళ్ళి, తిరిగి యథాస్థానానికి వచ్చేస్తుంది,'' అంటూ మంత్రవేత్త ఎముకను పుర్రెచుట్టూ తిప్పుతూ ఏవో మంత్రాలు చదివాడు. పుర్రె చిత్రంగా దొర్లుతూ దొంగ కేసి వెళ్ళి, తిరిగి ముగ్గు మధ్యకు చేరుకున్నది.

''చూశావా? వీడు దొంగతనం చెయ్యలేదు. అనవసరంగా కొట్టబోయావు. వదిలేస్తే వాడి మానాన వాడు పోతాడు,'' అన్నాడు మంత్రవేత్త.

ఆనందుడు అప్పటికీ నమ్మలేక, ''వీడి సంగతి నేను చూసుకుంటాను లెండి," అంటూ దొంగను తన వెంట తీసుకుపోయాడు.

మర్నాడు ఆనందుడు దొంగతో సహా రాజసభకు వెళ్ళి, క్రితం రాత్రి దొంగ ఫలానా కంసాలి ఇంట దొంగతనం చేసినట్టు ఫిర్యాదు చేశాడు.



రాజు కంసాలిని పిలిపించి, "నిన్న రాత్రి మీ ఇంట దొంగతనం ఏమైనా జరిగిందా?" అని అడిగాడు.

"దొంగతనమా? లేదు, ప్రభూ! నా యింట ఏ వస్తువూ పోలేదు," అన్నాడు కంసాలి ఆశ్చర్యపడుతూ.

ఆనందుడికి ఆశ్చర్యం వేసింది. ఒక వేళ దొంగ ఏ దొంగతనమూ చెయ్యక ముందే తనకు దొరికాడేమోనని వాడు అనుకున్నాడు.

ఇంతలో సభలోకి ఇద్దరు భటులు అఘోరకుణ్ణి పెడరెక్కలు విరిచి కట్టి తెచ్చారు. వాళ్ళు తాము తెచ్చిన ఒక మూటను రాజు ముందు ఉంచి, "ప్రభూ, ఈ దుర్మార్గుడు కొన్ని క్షుద్రశక్తులతో ప్రజలను మోసగించి, భయపెట్టి డబ్బు సంపాదిస్తూ వస్తున్నాడు. వీడి మీద మొదటి నుంచీ కన్ను వేసి ఉంచాం. ఇప్పుడు వీడు ఈ ఖరీదైన నగలను అమ్మబోతూ ఉంటే, పట్టుకు వచ్చాం," అన్నారు.

రాజు మూట విప్పి నగలను చూసి, "ఇవి మన యువరాణి ఆభరణాలు! నెల క్రితం ఎవరో వీటిని దొంగిలించారు. ఇవి నీకు ఎలా వచ్చాయి చెప్పు?" అని మంత్రవేత్తను గద్దించాడు.

ఆ నగలను చూసి ఆనందుడు గతుక్కుమన్నాడు.

అఘోరకుడు వణికి పోతూ, తాను దొంగతో లాలూచీపడి ఆ నగల మూటను తాను దాచినట్టు చెప్పాడు. దొంగ తాను వాటిని కంసాలి ఇంట దొంగిలించినట్టు ఒప్పుకున్నాడు.

కంసాలి వణికి పోతూ, "ఆ నగలు మా ఇంట ఉండిన మాట నిజమే కాని, వాటిని నేను దొంగిలించలేదు. ఆనందుడే వాటిని తెచ్చి, అమ్మి పెట్టమని నా చేతికి ఇచ్చాడు," అన్నాడు.

ఆనందుడూ, దొంగా, మంత్రవేత్తా, కంసాలీ అందరూ దొంగలే నని తేలింది. రాజు అప్పటికప్పుడే నలుగురినీ కారాగారానికి పంపేశాడు.





# వీరహనుమాన్

విభీషణుడి విషయంలో హనుమంతుడిచ్చిన సలహా విన్న మీదట రాముడు అందరూ వినేటట్టుగా ఇలా అన్నాడు:

"విభీషణుడు చెడ్డవాడే అయినప్పటికీ శరణాగతి కోరిన వాడిని విడిచి పుచ్చటం అధర్మం."

"ఇతను చెడ్డవాడైనా, మంచివాడే అయినా అతనితో మనకు ఏం పని?" అని సుగ్రీవుడు అడిగాడు. చిక్కులలో ఉన్న అన్నను విడిచివచ్చిన వాడు కృతఘ్నుడనీ, ఎవరినైనా విడవగలడనీ సుగ్రీవుడి అభిప్రాయం.

రాముడు లక్ష్మణుడితో సుగ్రీవుడి అభిప్రాయాన్ని ఖండిస్తూ మాట్లాడాడు. జ్ఞాతుల మధ్య వైరం ఉంటుంది. అన్నకు భయపడి విభీషణుడు వచ్చాడు. అతనికి అన్న రాజ్యం కావాలి. అందు చేత అతను రాముణ్ణీ, వానరులనూ విడిచి పుచ్చడు.

"మనని చంపటానికి రావణుడే ఇతన్ని పంపి ఉంటాడు. ఇతన్ని చేరదీయటం అపాయకరం." అన్నాడు లక్ష్మణుడు. రావణుడి తమ్ముణ్ణి ఎలా నమ్మటమని సుగ్రీవుడు అడిగాడు.

కాని రాముడు శరణాగతుడికి ఆశ్రయమివ్వటం పరమ ధర్మమనీ, అతణ్ణి నిరాకరించటం మహా పాపమనీ, అతను విభీషణుడి వేషంలో వచ్చిన రావణుడే అయినా చేరదీస్తాననీ చెప్పి, అతన్ని తీసుకురమ్మని సుగ్రీవుడితో అన్నాడు.

20. శుకుడి రాయబారం

సుగ్రీవుడు వెళ్ళి, వెంటనే విభీషణుడితో తిరిగి వచ్చాడు. విభీషణుడు, తన వెంట ఉన్న నలుగురు రాక్షసులతో సహా రాముడి పాదాలకు వందనం చేసి, "నేను రావణుడి తమ్ముణ్ణి. అతను నన్ను అవమానించాడు. అందుచేత నిన్ను శరణు జొచ్చాను. అందుకోసం నేను లంకలోని నా వాళ్ళందరినీ, బంధు మిత్రులనూ, భార్యాబిడ్డలనూ, నా సంపద అంతటినీ వదిలి పెట్టాను. ఇక నా రాజ్యమూ, జీవితమూ, సుఖమూ నీ అధీనంలో ఉన్నాయి," అన్నాడు.

రాముడి చెవులకు ఈ మాటలు ఎంతో మధురంగా సోకాయి. అతను విభీషణుణ్ణి రాక్షసుల బలా బలాలు వివరించి చెప్పమని అడిగాడు. విభీషణుడు ఇలా చెప్పాడు :

బ్రహ్మదేవుడి వరం వల్ల రావణుడు గంధర్వులకుగాని, నాగులకుగాని, రాక్షసులకుగాని, ఏ భూతాలకుగాని ఓడడు. అతని తమ్ముడూ, విభీషణుడికి అన్నా అయిన కుంభకర్ణుడు పరాక్రమంలో ఇంద్రుడికి తీసిపోడు. రావణుడి కొడుకు ఇంద్రజిత్తు తన వేళ్ళకూ, శరీరానికీ అభేద్యమైన కవచాలు ధరించి, యుద్ధం చేస్తూనే అదృశ్యం కాగలడు; అందుకోసం అతను యుద్ధం మధ్యలోనే అగ్నిని అర్చిస్తాడు. రావణుడి సేనాపతులు దిక్పాలకులకు సమమైన పరాక్రమం కలిగిన వాళ్ళు. ఇష్టంవచ్చిన రూపం



ధరించగల రాక్షసులు లంకలో అసంఖ్యాకులున్నారు. అలాటి రాక్షసుల సహాయంతో రావణుడు దిక్పాలకులను జయించాడు.

అంతావిని రాముడు, "నేను రావణుణ్ణీ అతని రాక్షస వీరులనూ చంపి, నిన్ను లంకకు రాజుగా చేస్తాను, ఇది నా ప్రతిజ్ఞ. రావణుణ్ణి అతని బంధువులతో సహా చంపక నేను అయోధ్యకు తిరిగి వెళ్ళను. నా తమ్ముల మీద ప్రమాణం చేసి చెబుతున్నాను," అని విభీషణుడితో అన్నాడు.

ఈ మాటవిని విభీషణుడు రాముడికి సాష్టాంగ నమస్కారం చేసి, "నేను కూడా నా శక్తికొద్దీ రాక్షసులను చంపటానికీ, లంకానగరాన్ని జయించటానికీ సహాయపడతాను; శత్రువులతో యుద్ధం చేస్తాను," అన్నాడు.

రాముడు సంతోషంతో విభీషణుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడితో, "లక్ష్మణా, సముద్రజలం తెచ్చి, విభీషణుణ్ణి రాక్షస రాజుగా అభిషేకించు," అన్నాడు.

వానరుల మధ్య విభీషణుడికి రాక్షస రాజ్యాభిషేకం జరిగింది. వానరులు సింహనాదాలు చేసి, రాముణ్ణి పొగడారు.

తరవాత సుగ్రీవుడూ, హనుమంతుడూ ఏకాంతంగా విభీషణుడితో, "మనమంతా ఈ వానరులతో సహా ఈ మహాసముద్రాన్ని ఎలా దాటటం?" అన్నారు.

దానికి విభీషణుడు, "రాముడు సముద్రుడి శరణుపొందాలి. రాముడి





సేన అంతా కలయజూసి వెళ్ళి, రావణు డితో ఇలా చెప్పాడు :

"వానర భల్లూక సేన మరో సముద్రం లాగున్నది. రామలక్ష్మణులు ఉత్తమా యుధాలు ధరించి, సీత కోసం రావటానికి సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు సముద్రం దగ్గిర విడిసి ఉన్నారు. నేను పైపైన చూసి వచ్చాను. వివరంగా చూసి రావ టానికి ఎవరినైనా పంపు."

రావణుడు శుకుడు అనే రాక్షసుడితో, సుగ్రీవుడితో ఇలా చెప్పమన్నాడు :

సుగ్రీవుడా, నేను రాముడి భార్యను తీసుకురావటానికీ, వానరరాజువైన నీకూ ఏమిటి సంబంధం? ఏమీ లేదు! నువు బుద్ధిమంతుడివి. బాగా ఆలోచించుకుని, కిష్కింధకు తిరిగి వెళ్ళు. దేవతలూ, గంధర్వులూ ప్రవేశించలేని లంకానగ రాన్ని వానరులు ప్రవేశిస్తారన్నది వట్టి మాట."

శుకుడు రావణుడి సందేశాన్ని విని, పక్షి రూపం ధరించి, వానరసేనలున్న ఉత్తర తీరానికి చేరాడు: వాడు సుగ్రీ వుడికి ఎగువగా ఆకాశంలోనే ఉండి, రావణుడు చెప్పమన్న మాటలు చెప్పాడు.

అలా మాట్లాడే శుకుణ్ణి చంపేద్దామని వేగంగా కొందరు వానరులు ఆకాశంలోకి లేచి, శుకుణ్ణి పట్టుకుని నేలకేసి కొట్టారు,

పూర్వుడైన సగరుడు సముద్రానికి ఎంతో మేలు చేశాడు కనక, సముద్రుడు రామ కార్యానికి అన్నివిధాలా సహాయ పడతాడు," అన్నాడు.

సుగ్రీవుడు రామలక్ష్మణులున్న చోటికి వచ్చి, విభీషణుడు చెప్పిన మాట చెప్పాడు. రాముడు విభీషణుడి సలహాతో తృప్తిపడి, సుగ్రీవుణ్ణీ, లక్ష్మణుణ్ణీ వాళ్ళ అభిప్రాయం అడిగాడు. వాళ్ళు కూడా విభీషణుడి అభిప్రాయాన్ని బలపరిచారు.

అప్పుడు రాముడు సముద్రతీరాన దర్భలు పరిచి, వాటి పైన పడుకున్నాడు.

ఇదే సమయంలో రావణుడి చారుడైన శార్దూలుడు అనే రాక్షసుడు వచ్చి, వానర



వాడు రాముడితో, "రాముడా, దూతను చంపవచ్చునా? ఈ వానరులు నన్ను చంపేస్తున్నారు. వద్దని చెప్పు," అన్నాడు.

రాముడు వానరులను వారించాడు. శుకుడు రెక్కలు విదిల్చి, ఆకాశంలోకి ఎగిరి, "సుగ్రీవా, రావణుడితో ఏం చెప్పమంటావు?" అని అడిగాడు.

సుగ్రీవుడు రావణుడితో తన మాటగా ఇలా చెప్పమని శుకుడితో అన్నాడు:

"నువు నాకు స్నేహితుడివి కావు. నువు నాకు ఎలాటి ఉపకారమూ చేసి ఉండలేదు. పైపెచ్చు నా స్నేహితుడైన రాముడికి శత్రువువు. నా శత్రువైన వాలికి మిత్రుడివి. ఈ రెండు విధాలా నాకు శత్రువువు. వాలి చచ్చినట్టు నువూ చస్తావు. నేను నిన్నూ, నీ కొడుకులనూ, బంధువులనూ, దాయాదులనూ చంపేస్తాను. త్వరలోనే మహాసేనతో లంకకు వచ్చి, దాన్ని నిర్మూలిస్తాను. రాముడి బారినుంచి నిన్ను దేవేంద్రాదులు కూడా రక్షించలేరు. సీతను అపహరించటం గొప్ప కాదు. రామలక్ష్మణులకు భయపడి, వాళ్ళు లేని సమయంలో ఆ పనిచేశావు. వాళ్ళ చేతిలో నీకు చావు మూడింది."

ఈ సందేశంతో శుకుడు వెళ్ళిపోకుండా అంగదుడు అడ్డుతగిలి, సుగ్రీవుడితో, "వీడు దూత కాడు, రావణుడి వేగులవాడులాగున్నాడు. మన సేనలను పరిశీలిస్తున్నాడు," అన్నాడు.

వెంటనే సుగ్రీవుడు శుకుణ్ణి పట్టుకోమని వానరులను ఆజ్ఞాపించాడు. శుకుడు మళ్ళీ వానరులకు చిక్కి, "అయ్యో, నా రెక్కలు విరిచారు. కళ్ళు పీకుతున్నారు," అని ఆక్రోశించేసరికి, రాముడు అడ్డుపడి, వాణ్ణి వానరుల బారినుంచి విడిపించాడు.

తరవాత రాముడు సముద్రతీరాన దర్భలు పరిచి, సముద్రానికి నమస్కారం చేసి, చెయ్యి తల కింద పెట్టుకుని దర్భల మీద పడుకున్నాడు. అతని ముఖం సముద్రం కేసి ఉన్నది. అతను అలా



పడుకుని, సముద్రుణ్ణి ధ్యానిస్తూ మూడు రాత్రులు గడిపాడు. కాని సముద్రుడు ప్రత్యక్షం కాలేదు.

రాముడికి కోపం వచ్చింది. కళ్ళు ఎర్రబడ్డాయి. అతను లక్ష్మణుడితో, "ఈ సముద్రుడు ఎందుకు రాడు? అతడికి ఎంత గర్వం! నా బాణాలతో ఈ సముద్రంలోని ప్రాణులన్నిటినీ చంపి, సముద్రాన్ని అల్లకల్లోలం చేస్తాను. నా విల్లూ, బాణాలూ తీసుకురా," అన్నాడు.

లక్ష్మణుడు వాటిని తెచ్చి ఇచ్చాడు. రాముడు విల్లు ఎక్కుపెట్టి, వజ్రాయుధాలలాటి బాణాలను సముద్రం మీద ప్రయోగించాడు. అవి సముద్రజలంలో ప్రవేశించి, తరంగాలూ, పొగలూ భయంకరంగా లేపాయి.

రాముడు ఇంకా బాణాలు వేయబోవటం చూసి, ఇలా అయితే మూడు లోకాలూ మండిపోతాయనుకుని, "వద్దు, వద్దు. మరి బాణాలు వేయకు," అంటూ రాముడి విల్లు పట్టుకున్నాడు లక్ష్మణుడు.

అయితే ఇంకా సముద్రుడు కనిపించలేదు. అందుచేత రాముడు సముద్రుడితో, "ఓ సముద్రుడా, నిన్ను నా బాణాలతో ఎండగట్టేసి, ఎడారి చేసేస్తాను. నా బలపరాక్రమాలను నువు ఊహించను కూడా లేవు. నీ అజ్ఞానానికి కారణం నీలో ఉన్న దానవులతో నువు చేసిన స్నేహం అయి ఉంటుంది," అన్నాడు.

ఇలా అని రాముడు తన వింటికి బ్రహ్మాస్త్రం సంధించి, చెవిదాకా లాగి, విడవటానికి సిద్ధంగా ఉండగా, ఆకాశమూ, భూమీ దద్దరిల్లాయి. కొండలు గజగజలాడాయి. ఒక్కసారిగా చీకటి కమ్మినట్టయింది. ఆకాశంలో ప్రచండమైన వాయువులు వీచాయి. ప్రాణులు ఆర్తనాదాలు చేశాయి. సముద్రం ఒక యోజనం వెనక్కు తీసింది. అది చూసి రాముడు తన అస్త్రాన్ని వదలడం మానుకున్నాడు.

అంతలో సముద్ర మధ్యంలో సముద్రుడు కనిపించాడు. అతడి శరీరం వైడూర్యకాంతి కలిగి ఉన్నది. అతను దివ్యపుష్పమాలికలు ధరించి, బంగారు ఆభరణాలు అలంకరించుకుని, గంగా, సింధు మొదలైన నదులను వెంటబెట్టుకుని సాక్షాత్కరించాడు.

సముద్రుడు రాముడి వద్దకు వచ్చి, చేతులు జోడించి, "రామా! లోతూ, గాంభీర్యమూ నా సహజ గుణాలు. నా జలాన్ని స్తభించటం నాకు శక్యం కాదు. నా చేతిలో ఉన్నదేమంటే, నీ సేన నన్ను దాటేదాకా సముద్రప్రాణుల వల్ల మీకు ఎలాటి భయమూ లేకుండా నేను చూడగలను," అన్నాడు.

"అలా అయితే ఈ ఎక్కుపెట్టిన బాణాన్ని ఎక్కడ ప్రయోగించను?" అని రాముడు సముద్రుణ్ణి అడిగాడు.

"ఇటు ఉత్తరంగా ఒక ప్రదేశం ఉన్నది. అక్కడ అభీరులనే పాపాత్ములు ఉండి, పాపకార్యాలు చేస్తున్నారు. నీ బాణాన్ని వారిపైన ప్రయోగించి, సర్వనాశనం చెయ్యి," అన్నాడు సముద్రుడు రాముడితో.

రాముడు సముద్రుడు చెప్పినట్టే చేశాడు. అది పడినచోటు సర్వనాశనమయిపోయింది. బాణం పడినచోట పాతాళజలం పైకి వచ్చింది. దానికి వ్రణకూపమని పేరు.

తరవాత సముద్రుడు రాముడితో, "నలుడు అనే వానరుడు విశ్వకర్మ కొడుకు. ఇతను సముద్రం మీద సేతువు కట్టుతాడు. ఆ సేతువు నీటిలో మునిగిపోకుండా నేను చూస్తాను," అని చెప్పి అంతర్ధానమయాడు.

నలుడు రాముడితో తాను విశ్వకర్మ కొడుకునేననీ, విశ్వకర్మ నుంచి వరాలు పొందాననీ, సేతువు కట్టటం తనకు సాధ్యమేననీ, కావాలంటే వానరులు అప్పటికప్పుడే సేతువును కట్టటం కాలయాపన చెయ్యకుండా ప్రారంభించవచ్చుననీ అన్నాడు.






ఐకమత్య ముపాగమ్య,
శాస్త్రదృష్టేన చాక్షుషా,
మంత్రిణో యత్ర నిరతాః
తమాహు ర్మంత్ర ముత్తమం. 1

[మంత్రులందరి మధ్యా ఏకాభిప్రాయం కలిగి, శాస్త్రదృష్టితో ఆలోచించి, ఆసక్తితో చేసే మంత్రాలోచన ఉత్తమమైనది.]

బహ్వ్యోపి మతయో భూత్వా,
మంత్రిణా మర్థనిర్ణయే,
పున ర్యత్త్రైకతాం ప్రాప్తాః
స మంత్రో మధ్యమః శ్రుతః. 2

[మంత్రులకు ఎన్నిరకాల అభిప్రాయ భేదాలున్నప్పటికీ, మంత్రాలోచన చెయ్యటానికి అందరూ ఒకటి అయి చేసిన మంత్రాలోచన మధ్యమమని చెప్పాలి.]

అన్యోన్యం మతి మాస్థాయ,
యత్ర సంప్రతిభాష్యతే,
నచైకమత్యే శ్రేయోస్తి
మంత్ర స్సోధమ ఉచ్యతే. 3

[మంత్రుల మధ్య భిన్నాభిప్రాయాలుండి, ఐకమత్యం కుదరని చోట జరిగే మంత్రాలోచన అధమమని చెప్పాలి.]

మంత్రాలోచన

Photo by N. Pakkirisamy



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఒకటే మా వయసు

పంపినవారు:
శ్రీమతి కడియాల సుబ్బలక్ష్మి

Photo by M. Dudhediya



జగ్గయ్యపేట.
కృష్ణాజిల్లా.

ఒకటే మా సొగసు

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు మే 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూలై నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| మిత్రసంప్రాప్తి – 35 | 2 | లోభి ఆతిథ్యం | 31 |
| మాయాసరోవరం–5 | 5 | సుల్తానా వడ్డీవ్యాపారం | 32 |
| వ్యర్థమైన పరీక్ష | 13 | పెళ్ళాంపోరు | 38 |
| తెలివిగలభార్య | 19 | అందరూ అందరే! | 42 |
| ప్రపంచపు వింతలు | 25 | వీరహనుమాన్ - 20 | 45 |
| అచ్చిరాని షరతులు | 26 | అమరవాణి | 53 |



Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Pubilshed by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras - 600 026: Controlling Editor: NAGI REDDI

# అన్నీ ప్రయత్నం చేసిన తర్వాత తిరిగి

# క్వాలిటీ

# గ్లూకోస్ బిస్కట్ల కోసమే వస్తారు

సహజం : మీకు తెలుసు విటమిన్లు, పోషకాహార పదార్థములు కలిగిన క్వాలిటీ గ్లూకోస్ బిస్కట్ మీ సొమ్ముకు మించిన ప్రతిఫల మిచ్చేదని.



క్వాలిటీ ఫుడ్ ప్రొడక్ట్స్

క్వాలిటీ అంటే **ఉత్తమమైన** బిస్కట్లు అన్నమాట

glucos BISCUITS

Rachana-KFP-48

# విజయ సాధక దశాబ్దం

## వ్యవసాయం

ఈ పదేండ్లలో రూపొందించిన పథకాల ఫలితంగా వ్యవసాయ విప్లవం ఏర్పడింది.

పెద్ద సాగునీటి ప్రాజెక్టులకు కమాండ్ ఏరియా కార్యక్రమం ఫలితంగా సాగునీటి సదుపాయాలు ఎక్కువయ్యాయి.

## పరిశ్రమ

లైసెన్సింగ్ పద్ధతిని ఉదారం చేశారు; ఇంకా సరళం చేశారు.

అనేక రంగాల్లో స్వయం సమృద్ధి సాధించాం.

ముడి పదార్థాలు ఇంకా సులభంగా లభ్యమవుతున్నాయి.

చిన్న పరిశ్రమలకు ఇంకా ఎక్కువ ప్రోత్సాహం ఏర్పడింది.

## కమ్యూనికేషన్లు

రైలు, రోడ్డు రవాణా మెరుగుపడింది.

రోడ్లు ఇంకా బాగుపడ్డాయి.

తంతి-తపాల సదుపాయాలు విస్తరించారు.

టెలిఫోను కనెక్షన్లు పెరిగాయి.

## సాంఘిక సేవలు

గ్రామీణ ఆరోగ్య పథకాలకు ప్రాముఖ్యం ఇస్తూ ఆరోగ్య-వైద్య సర్వీసులను సంఘటిత పరిచారు.

ఇంకా ఎక్కువగా డాక్టర్లు, నర్సులు ఉన్నారు; ఆస్పత్రి పడకలు ఎక్కువయ్యాయి.

చాల రాష్ట్రాల్లో హయ్యర్ సెకండరీ స్థాయివరకు ఉచిత విద్యకు ఏర్పాట్లు జరిగాయి.

మహిళలు, యువజనుల సంక్షేమానికి ప్రత్యేక అభివృద్ధి ప్రాజెక్టులను ప్రారంభించారు.



❖

ఇది
కార్యసాధన
పూరిత
దశకం.

davp 75/559

